# ‘బైరాగి’ నిర్యాణం



శ్రీ ఆలూరి బైరాగి చౌదరి జననం: 5-9-1925 నిర్యాణం: 9-9-1978 స్వగ్రామం: అయితా నగర్, తెనాలి. స్వయంకృషితో ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ, బెంగాలీ భాషలయందు వీరు ప్రావీణ్యం సంపాదించారు. హిందీ ఉపాధ్యాయులుగా జీవితం ప్రారంభించి ‘చందమామ’ సంపాదకవర్గంలో హిందీ చందమామకు సంపాదకులుగా కొన్నేళ్లు పనిచేశారు. తెలుగులో పిల్లల ‘కథాగేయాలు’, ‘త్రిశంకు స్వర్గం’, ‘దివ్యభవనం’ అనే కథా సంపుటాలు. ‘చీకటి నీడలు’, ‘నూతిలో గొంతుకలు’ అనే తెలుగు కవితా సంపుటాలు, హిందీలో ‘పలాయన్’ అనే కవితా రచనలు మిక్కిలి ప్రసిద్ధి గడించినవి. వీరి ఆత్మకు శాంతి కలుగుగాక.

# వినతి

పశ్చిమ బెంగాల్, ఉత్తరప్రదేశ్, బీహార్ మొదలైన రాష్ట్రాలు ఈ మధ్య పెనుతుఫానుకు బలయి ఎంతగానో నష్టపడ్డాయి. వేలాది ప్రజలు ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఇళ్ళు, పంటలూ ధ్వంసమైపోయాయి. ఎన్నో సోదర కుటుంబాలు నిలవ నీడలేక అల్లాడిపోతున్నాయి. పలువిధాల నష్టపోయిన సాటి మానవులకు, సహాయపడవలసిన విధి, కర్తవ్యం మన అందరి మీదా వున్నది. ప్రతివారూ ఈ ‘సహాయం’ తమ తక్షణ కర్తవ్యంగా భావించి-తమ శక్త్యానుసారం ‘ప్రధానమంత్రి వరదబాధితుల నిధి’కి విరాళంగా పంపి, సాటి ప్రజలను ఆదుకోవలసిందిగా ‘చందమామ’ అభ్యర్థిస్తున్నది.

# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [''పాపాత్ముడి పుణ్యం''] కు ఆధారం పి. వి. ఎస్సెస్సెన్రాజు రచన.

సెప్టెంబరు నెల కథా శీర్షిక పోటీ ఫలితం

''ఏడ్చినట్టుంది!''

పంపినవారు: జి. నాగభూషణం, కోడూరు. (కడప జిల్లా)

## అమరవాణి

అనుకూలాం, విమలాంగీం, కులజాం,
కుశలాం, సుశీలసంపన్నాం,
పంచలకారాం భార్యాం పురుషః
పుణ్యోదయా ల్లభతే. 3

[అనుకూలవతీ, సౌందర్యము గలదీ, మంచి కులంలో పుట్టినదీ, నేర్పరీ, మంచి స్వభావం గలదీ అయిన భార్య మగవాడికి పుణ్యంవల్ల లభిస్తుంది.]


సంపుటి 63 నవంబర్ '78 సంచిక 5

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00







శ్రీహరి వి. దామలె, భండిహాళె (కర్ణాటక)

ప్ర: డబ్బు అనే వస్తువు ఎలా వచ్చింది?

జ: ఆటవికదశలో మనిషికి కావలసిన సంపద, అనగా తిండీ, బట్టా ప్రకృతిలోనే లభించేవి. మనిషి ఆహారాన్ని ఏరుకునేవాడు, లేదా వేటాడేవాడు. ఆ దశలో మృగచర్మాలు బట్టలుగానూ, ఇళ్ళ ఆచ్ఛాదనకూ కూడా ఉపయోగపడ్డాయి. కాని క్రమంగా మనిషి తనకు కావలసిన సంపదను తానే ఉత్పత్తి చేసుకోసాగాడు. వ్యవసాయమూ, పశుపోషణా అభివృద్ధి అయిన కొద్దీ, ఒక్క మనిషి కృషితో పదిమందికి ఆహారం సృష్టించటం సాధ్యమయింది. అంటే మనిషి తన అవసరాలకు మించి ఉత్పత్తి చేసే దశకు వచ్చాడు. ఆ విధంగా సంఘంలో అనేకమంది వ్యక్తులు ఆహారోత్పత్తినుంచి తప్పుకుని, కమ్మరం, కుమ్మరం, వడ్రంగం, శిల్పం, ఆభరణాల తయారీలాటి అనేక పనులు నేర్చి, సంపదను బహుముఖంగా పెంపొందించే అవకాశం ఏర్పడింది. ఇదే పరిణామం సంఘాల మీద సమిష్టిగా జరిగింది. అంటే అనేక సంఘాలు తమ అవసరాలకు మించి ఉత్పత్తి చేయగలిగాయి. అన్ని సంఘాలూ ఒకేరకం సంపద సృష్టించవు గనక, మారకం ద్వారా నాగరికత సంఘం నుంచి సంఘానికి పాకి, దాని ప్రభావం విస్తరించింది.

కాని కేవలం సంపదను మారకం వేసుకోవటం వల్ల ప్రయోజనం పరిమితంగానే ఉంటుంది. అంతకంటే వర్తకం వల్ల చాలా హెచ్చు లాభం. మాటవరసకు, ఒక రైతు దగ్గిర కొద్దిపాటి ధాన్యమూ, ఇంకొక కుమ్మరి వద్ద కొద్ది కుండలూ మిగిలాయనుకుందాం. వాటికి సమీప ప్రాంతంలో గిరాకీ ఉండదు. కాని వర్తకుడు పదిమంది దగ్గిర మిగిలిన ధాన్యాన్ని పోగుచేసి, పెద్ద మొత్తంలో చేర్చి, దానిని గిరాకీ ఉన్న చోటికి తీసుకుపోయి అమ్మవచ్చు. కొనటం అమ్మటం అనేసరికి వేరు వేరు వస్తువుల విలువలను నిర్ణయించేది ఏదో ఉండాలి. అదే డబ్బు. (లోహపు నాణాలు రాకముందు, డబ్బు ప్రాకృత దశలో గవ్వలు వగైరాల రూపంలో చలామణీ అయింది.) రాగి, వెండి, బంగారాలతో చేసిన ఈ డబ్బును ఎంత చిన్న మొత్తాలలోనైనా నిలవచేసి ఉంచుకోవచ్చు. నెలకు ఒక వెండి నాణెం ఖరీదుచేసే అదనపు సంపద గలవాడు సైతం, నూరు మాసాలు డబ్బు కూడబెట్టి, నూరు వెండి నాణాలు విలువగల ఖరీదైన వస్తువును కొనుక్కోవచ్చు.

డబ్బు లేకపోతే మనం నాగరికత అనుకునేది సాధ్యం అయి ఉండేది కాదంటే అతిశయోక్తి కాదు.




## 65

నక్కమాటలు విని లంబకర్ణానికి తీవ్రమైన కోరిక పుట్టి, నక్క వెంట వెళ్ళటానికి తొందరపడింది. నక్క దాన్ని సింహం వద్దకు తీసుకు పోయింది. గాడిద చాలా నింపాదిగా వస్తూండటం చూసి, ఆత్రంలో ఉన్న మతిమాలిన సింహం దాన్ని చంపటానికి దాని మీదికి దూకింది. అయితే అది మరీ బలంగా దూకిన కారణంచేత గాడిదను దాటి దూరంగా పడింది. అసలే గాయపడి ఉన్నదేమో, దూకిన శ్రమతో అది కొద్దిసేపు కదలలేక పోయింది.

సింహం దూకిన దూకును ఎలా అర్థం చేసుకోవాలో గాడిదకు తెలియలేదు. తన పక్కనే పిడుగు పడినట్టుగా అయి, భయంతో మతిపోయి అది పారిపోయింది. పారిపోతూ వెనక్కు తిరిగి చూస్తే, దాని కొక వింత జంతువు, భయంకరమైన వాలకంతో, క్రూరమైన కోరలతో, ఎర్రని కళ్ళతో కనిపించింది. గాడిద గ్రామానికి పారిపోయింది. దూకటంతో కళ్ళు బైర్లు కమ్మిన సింహం దాన్ని తరమలేక పోయింది.

నక్క సింహంతో, "ఏమిటిది? నీ ప్రతాపమూ, నేర్పరి తనమూ ఎలాటిదో ఇవాళ చూశాను," అన్నది.

"దూకటానికి పూర్తిగా సిద్ధంగాలేను. దానికి తోడు అకస్మికంగా కలిగిన సంతోషంలో మతిపోయింది. ఏం చేసేది? నేను నిజంగా సిద్ధంగా ఉంటే ఏనుగునైనా తప్పిపోనిస్తునా?" అన్నది సింహం.

"అలా అయితే ఇప్పటి నుంచీ సిద్ధంగా ఉండు. నేను దాన్ని మళ్లీ తెస్తాను," అన్నది నక్క.



"మిత్రమా, అది మళ్ళీ రమ్మంటే వస్తుందా? ఇంకో జంతువును తీసుకురా," అన్నది సింహం.

"దాన్ని గురించి నీకు బెంగ దేనికి? అదంతా నేను చూసుకుంటాలే," అని నక్క గాడిద వెళ్ళిన దారినేపోయి, అది ఆ చెరువు ఒడ్డునే మేస్తుండటం చూసింది.

నక్కను చూసి గాడిద, "చూడు, అల్లుడూ! నువ్వయితే నన్ను ఆ చక్కని ప్రదేశానికి తీసుకు పోయావుగాని, నాకు వెంట్రుకవాసిలో చావు తప్పింది," అన్నది.

నక్క గట్టిగా నవ్వి, "మామా, నేను చెప్పిన ఆడగాడిదలలో అది ఒకటి. అది గుర్తుపట్టరాకుండా ఒళ్లు చేసింది. అది చక్కగా ముస్తాబై, భర్తకోసం ఎదురు చూస్తూ, మిగిలిన రెండు ఆడగాడిదల కన్న ముందుగా నిన్ను ఆలింగనం చేసుకుందామని, చేతులు చాచి నీ మీద దూకి, నిన్ను దాటి అవతలపడింది. మితి మీరిన ఆనందంలో అది అలా చేస్తే, నువు పిరికితనం కొద్దీ పారిపోయావు. ఇదే జరిగిన సంగతి. నీ ప్రవర్తనకు నువు సిగ్గుపడాలి. కనుక మళ్లీ రా! అది నీ కోసం తిండీ, నీరూ మాని, లంబకర్ణం తన భర్తకాని పక్షంలో నీటిలోనే, నిప్పులోనే ప్రవేశిస్తుందట, లేదా, విషం పుచ్చుకుంటుందట. నిష్కారణంగా ఒక ఆడకూతురి ప్రాణం ఎందుకు తీస్తావు? మహాపాపం! మన్మధుడు కూడా నిన్ను క్షమించడు. అప్పుడు నీకు జత దొరకదు. ఆడదాన్ని తృణీకరించి, మన్మధుడికి ఆగ్రహం తెప్పించిన వాళ్ళు బైరాగి వాళ్ళయిపోయి, జుట్టు జడలు కట్టి, ఎర్రబట్టలు కట్టి, కపాలాలు పట్టుకు తిరుగుతారట," అన్నది.

నక్క చెప్పిన ఈ మాటలు నమ్మి, బుద్ధిలేని గాడిద దాని వెంట వచ్చింది. విధి తోస్తూంటే వివేకికి కూడా మతి పని చెయ్యదంటారు. గాడిద తగిన దూరంలోకి రాగానే సింహం దాని పైన దూకి, క్షణంలో చంపింది. తరవాత అది నక్కను

గాడిద శవానికి కాపలా పెట్టి, సమీపంలో ఉన్న నదిలో స్నానం చేసి రావటానికి వెళ్లింది.

మంచి ఆకలిమీద ఉన్న నక్కకు, గాడిద గుండెకాయా, చెవులూ తినాలన్న కోరిక ఎంత అణచుకున్నా అణగక, అది వాటిని కాస్తా తినేసింది. సింహం స్నానం చేసి తిరిగి వచ్చి, గాడిద చెవులూ, గుండెకాయా లేకపోవటం గమనించి, ఆగ్రహావేశంతో, ''హీనుడా, ఇలాటి కూడనిపని ఎందుకు చేశావు? నువు చెవులూ, గుండెకాయా తిని, నాకు నీ ఎంగిలి వదులుతావా?'' అన్నది.

నక్క ఎంతో వినయంగా, ''ప్రభూ, అలా అనకండి. నేను నిర్దోషిని. ఈ జంతువుకు చెవులూ, గుండెకాయా ఏనాడూ లేవు. లేకపోతే ఒకసారి తమరిని చూసి పారిపోయినది మళ్ళీ ఇక్కడికి వస్తుందా? దానికి చెవులు లేనికారణంచేతనే తమ గర్జనా, దూకిన చప్పుడూ వినిపించలేదు. గుండెలేని కారణం చేతనే తమ భయంకరాకారం దాన్ని భయపెట్టలేదు. గుండె లేని దానికి భయంతో కూడిన దడ ఉండదు. అది ఇక్కడికి రావటానికీ, పారిపోవటానికీ ప్రత్యేకమైన కారణం ఏమీలేదు. అందుచేతనే దాన్ని మరొకసారి తీసుకు రాగలిగాను,'' అన్నది.



సింహం దానిమాట నమ్మింది. నక్క కూడా దానితోబాటు గాడిదశవాన్ని తిన్నది.

కోతి మొసలికి గాడిదకథ చెప్పి, ''మూర్ఖుడా, నువు నన్ను మోసగించావన్నమాటేగాని, యుధిష్ఠిరుడు అనే కుమ్మరి లాగా నోరు జారి నిజం చెప్పేశావు. తన మాయోపాయాల సందడి మధ్య నిజం చెప్పే మూర్ఖుడు యుధిష్ఠిరుడి లాగే కష్టాలపాలవుతాడు,'' అన్నది.

''ఏమిటా కథ?'' అని మొసలి అడగగా, కోతి ఇలా చెప్పింది:

కుమ్మరి వీరుడి కథ

ఒకనాడు ఒక కుమ్మరివాడు అమితంగా తాగి, తన ఇంటిపెరట్లో పరిగెత్తుతూ,

పడి పోయేసరికి, ఒక కుండపెంకు వాడి నుదుట్లో దిగబడి, గాయమై, రక్తం హెచ్చుగా కారింది. దానికి సరి అయిన చికిత్స జరగక, చీము పట్టి, మానటానికి చాలాకాలం పట్టింది. గాయం మానినాక కూడా దాని తాలూకు మచ్చ భయంకరంగా మిగిలిపోయింది.

తరవాత కొంత కాలానికి కుమ్మరి ఉండే ప్రాంతంలో కరువు వచ్చింది. అందుచేత కుమ్మరి తన దేశం విడిచి, దూరప్రాంతంలో ఒక రాజు వద్ద కొలువు చేయబోయాడు.

ఆ రాజు వాడి నుదుటి మీదగల భయంకరమైన మచ్చను చూసి, "వీడు గొప్ప వీరుడై ఉంటాడు. యుద్ధంలో వెనుకంజ వెయ్యకుండా వీరోచితంగా పోరాడుతూ శత్రువు చేతి కత్తి దెబ్బ తగిలిన గాయం తాలూకు మచ్చేగాని, వీడి ముఖం మీది మచ్చ మరొకటి కాదు. వీణ్ణి చూడగా పోరాటంలో వెన్నుచూపే వాడుగాలేడు. వీడు మన దగ్గిర ఉండదగిన వాడే," అనుకుని, కుమ్మరి వాడికి తన సేనలో మంచిపదవి ఇచ్చి, వాడికి ఎన్నో బహుమానాలిచ్చి గౌరవించాడు.

రాజు వాడిపట్ల చూపిన ప్రత్యేకాభిమానం ఇతర రాజపుత్రయోధులకు నచ్చలేదు. వాళ్ళు కుమ్మరిని చూసి అసూయపడ్డారుగాని, పైకి ఏమీ అనలేదు. ఎందుకంటే, రాజుగారికి ఆగ్రహం వస్తుందని ఒకటీ, వాడు నిజంగా గొప్పరాజపుత్ర వీరుడేనన్న నమ్మకం మరొకటీనూ.

కుమ్మరిని తన కొలువులోకి తీసుకున్న కొద్దికాలానికి రాజుగారికి శత్రురాజుతో యుద్ధం వచ్చింది. ఏనుగులనూ, గుర్రాలనూ ఆయత్తంచేసి, యుద్ధరంగానికి పంపవలసిన యోధులను ఎన్నిక చేశారు. ఈ సందర్భంలో రాజు తన సైనిక వీరులను పర్యవేక్షణ చేస్తూ, కుమ్మరిని చూసి, "ఓ రసపుత్రయోధుడా, నీ పేరేమిటి? నీ కులం ఏది? నీ ముఖంమీద ఆ భయంకరమైనగాయం ఏ యుద్ధంలో తగిలింది?" అని అడిగాడు.





# భల్లూక మాంత్రికుడు

## 5

[ రాజు జితకేతుణ్ణి శిక్షించేందుకు భల్లూకమాంత్రికుడు, కాళీవర్మనూ, ఇతరులనూ వెంట బెట్టుకుని, నగరం కేసి పోతున్నంతలో, రాజు దుర్ముఖుడి సైనికులు అతడి దారిని అడ్డగించారు. మాంత్రికుడు, దుర్ముఖుడి దగ్గిరకు పోయి, తలారిని మంత్రదండంతో తాకగానే, వాడు భల్లూకాకారంతో గండ్రగొడ్డలిని తిప్పుతూ, దుర్ముఖుడి కేసి దూకాడు. తరవాత—]

తలారి హఠాత్తుగా భయంకరమైన భల్లూకంగా మారి, తళతళ మెరుస్తున్న గండ్రగొడ్డలితో తన పైకి రావటం చూస్తూనే, రాజు దుర్ముఖుడు ఒక క్షణకాలం నిశ్చేష్టుడైపోయాడు. అంతలో తలారి తనకు అడ్డుగా వున్న రాజు అంగరక్షకులిద్దరిని కాలితో గట్టిగా తన్ని, వాళ్ళు కింద పడగానే, దుర్ముఖుడు కూర్చుని వున్న ఉన్నతాసనం కేసి వెళ్ళాడు.

దుర్ముఖుడు ఆ సరికి తెప్పరిల్లి, "ఒరే, సైనికులెక్కడ? అంగరక్షకులేమయ్యారు? ఈ ఎలుగుబంటును అడ్డగించి, కత్తులతో నరకండి!" అని అరుస్తూ, ఆసనం మీది నుంచి లేచి, కొద్ది దూరం పరిగెత్తి, తన గుర్రం మీద ఎగిరి కూర్చున్నాడు. అతడితోపాటు మరొక అంగరక్షకుడు కూడా పరిగెత్తిపోయి, మరొక గుర్రాన్ని ఎక్కాడు.



"మహారాజా, మనం ప్రస్తుతానికి యిక్కడి నుంచి పారిపోవటం క్షేమం. మన సైనికులు ఎక్కడో నదీ తీరాన గుడారాల్లో వున్నారు. వాళ్ళకు వార్త అంది వచ్చేలోపల, యీ మాంత్రికుడు తన ఎలుగుబంటితో, మనలనందర్నీ నిలువునా నరికించి పోగులు పెట్టగలడు," అన్నాడు అంగరక్షకుడు.

అంగరక్షకుడు యిలా చెపుతున్నంతలోనే రాజు దుర్ముఖుడు, వెనక నుంచి పరిగెత్తుకు వస్తున్న తలారి భల్లూకాన్ని చూసి, గుర్రాన్ని గట్టిగా అదిలించాడు. గుర్రం కూడా భల్లూకాన్ని చూసి బెదిరిపోయి, పెద్దగా సకిలించి, కళ్ళెపు తాళ్లను విదిలించి వేస్తూ, వేగంగా పరుగు పుచ్చుకున్నది.

రాజు దుర్ముఖుడూ, అతడి అంగరక్షకుడూ గుర్రాల మీద పారిపోవటం చూస్తూనే, కాళీవర్మ నిరుత్సాహపడిపోయి, భల్లూకమాంత్రికుడితో, "గురూ, ఈ చుట్టుపక్కల రాజ్యపాలకులుగా చెలామణీ అవుతున్న ఇద్దరు దుర్మార్గుల్లో ఒకడు దొరికి తప్పించుకుపోతున్నాడు. వాణ్ణి మన తలారి భల్లూకం వెంబడించి పట్టుకోగలదన్న నమ్మకం నాకు లేదు," అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, దుర్ముఖుడి గుర్రం వెనకగా పరిగెత్తుతున్న తలారి భల్లూకం కేసి ఓ మారు చూసి, తృప్తిగా తలాడించి, "కాళీ, ఆ రాజు మన తలారి గండ్రగొడ్డలికి చిక్కకపోతే, అప్పుడు వాడి అంతేదో నువ్వూ, నేనూ చూద్దాం," అని, అక్కడ ప్రాణభయంతో వణికిపోతున్న దుర్ముఖుడి మంత్రులూ, సలహాదార్ల కేసి కళ్ళెర్రచేస్తూ చూసి, "ఒరే, మీరు చంద్రశిలా నగరం మీదికి దాడి బయలుదేరారు గదా? మీ సైన్యం ఎక్కడ?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సలహాదార్లలో ఒకడు బొంగురుపోయిన గొంతుతో, "మహామాంత్రికులైన మీకు, ఆ సైన్యం ఎక్కడ

వున్నదీ తెలిసే వుండాలి. అయినా అడుగుతున్నారు గనక చెపుతున్నాను: వాళ్లందరూ నది ఒడ్డున గుడారాల్లో వుండి, రానున్న పోరాటంలో శత్రు సంహారం కోసం ఆయుధాలకు పదును పెడుతున్నారు,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఆ మాటలకు పెద్దగా నవ్వి, దాపులనే వుండి ఆశ్చర్యపోతూ చూస్తున్న మంత్రి జీవగుప్తుడితో, ''ఓయీ, చంద్రశిలానగర మంత్రీ, విన్నావా దుర్ముఖుడి సలహాదారు చెప్పిన మాటలు?'' అన్నాడు.

''అయ్యా, అంతా విన్నాను. ఇదంతా చూస్తూంటే నాకు మతిపోతున్నట్టున్నది,'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

''అవునా! నేనూ, కాళీవర్మా యీ ప్రాంతాలు వదిలి, హిమాలయ పర్వత శిఖరాల మీదుగా, ఆవలి లోయలకు చేరేలోపల, మరికొందరి అహం వదిలించి, మతులు పూర్తిగా పోగొట్టదలిచాను, ఏమంటావు?'' అన్నాడు భల్లూక మాంత్రికుడు మంత్రదండాన్ని నేలకు గట్టిగా తాటిస్తూ.

''అంతా తమ దయ,'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు తలవంచుతూ. భల్లూకమాంత్రికుడు తిరిగి ఏదో చెప్ప బోయేంతలో కాళీవర్మ మామిడిచెట్ల



లోంచి దూరంగా చూస్తూ, ''గురూ, చాలామంది సైనికులు కత్తులూ, ఈటెలూ ఎత్తిపట్టుకుని మనకేసే వస్తున్నారు!'' అంటూ ఒరలోనుంచి కత్తి దూస్తూ, తమ వెంట వున్న రాజు జితకేతుడి సైనికులను హెచ్చరించాడు.

భల్లూకమాంత్రికుడు యింకా భయకంపితులై వున్న రాజు దుర్ముఖుడి సలహాదార్లతో, ''ఒరే, మీలో ఒకడు ముందుగా పోయి, యిక్కడ మీ రాజుకు పట్టిన దుస్థితి ఏమిటో, ఆ సైనికులను వెంట బెట్టుకు వస్తున్న దళనాయకుడితో చెప్పండి. వాడు మూర్ఖం కొద్దీ నా మీదా, నా అనుచరుల మీదా దాడి చేయ



యత్నించాడో, మిమ్మల్ని పులులుగానూ, వాళ్ళను లేళ్ళగానూ మార్చి, మీకు, వాళ్ళను ఆహారం చేయబోతున్నాను,'' అన్నాడు.

''మహా మాంత్రికులు అందుకు సమర్థులే! మీ కళ్ళ ఎదుటే తలారిని భయంకరమైన ఎలుగుబంటుగా మార్చటం, చూశారు గదా?'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు, సలహాదార్లతో.

రాజు దుర్ముఖుడి మంత్రులూ, సలహాదార్లూ ఒకసారి ముఖముఖాలు చూసుకున్నారు. వాళ్ళల్లో ఒకడు అక్కడినుంచి బయలుదేరి, తమను సమీపిస్తున్న సైనికుల నాయకుణ్ణి కలుసుకుని, అతడికి జరిగినదంతా చెప్పి, ''మన రాజుగారు ప్రాణాలతో తిరిగి మనకు కనబడేవరకూ, మనం యీ భయంకరుడైన మంత్రవేత్త చెప్పినట్టు వినటం క్షేమమవుతుంది.'' అన్నాడు.

ఆ మాటలకు దళనాయకుడు కోపం తెచ్చుకుని, తన వెనక వున్న యాభైమంది సైనికులతో, ''ఈయన చెప్పింది విన్నారు కదా? నన్నడిగితే, ఇదంతా కేవలం కనుకట్టు అంటాను. ఇంతమంది సాయుధలం ఒక్కుమ్మడిగా పోయి మీద పడి, ఆ మాంత్రికుణ్ణీ, అతడి అనుచరులనూ హతమార్చలేమా?'' అన్నాడు.

''కాని, ఆ లోపల మాంత్రికుడు మనల్ని లేళ్ళగానూ, పులులుగానూ తన కనుకట్టు విద్యతో మార్చటం జరిగితే, అప్పుడు మనకు ఎలాంటి దుర్గతి పట్టనున్నదో ఆలోచించాలి గదా?'' అంటూ గుంపులోంచి ఒక సైనికుడు తన తోటి వాళ్ళకేసి చూశాడు.

''అయ్యా, దళనాయకా! మనం దుర్ముఖరాజుగారి ఉప్పు తింటున్నవాళ్లం గనక, అవసరం పడ్డప్పుడు ఆయనకోసం ప్రాణాలు ఒడ్డవలసిందే! కాని, యిప్పుడు విన్నదాన్నిబట్టి, రాజుగారు యింకా సజీవులే అన్న నమ్మకం ఏమిటి? ఆ భయంకర భల్లూకం గండ్రగొడ్డలితో

ఆయన తల యీసరికే నరికివుంటే, మన సాహసం, రాజభక్తి అంతా వృథా గదా!'' అన్నాడు, యింకొక సైనికుడు గుంపులో నుంచి ముందుకువచ్చి.

ఇది విన్న తరవాత దళనాయకుడి మనసులో, చిన్న దురాశలాటిది రేగింది. అతడు చుట్టూ ఓ మారు కలయచూసి, ''రాజు చావటం అంటూ జరిగితే, సింహాసనం కోసం తను ఎందుకు ప్రయత్నించకూడదు?'' అనుకుని, సైనికులతో, ''మనం ప్రస్తుతానికి చంద్రశిలా నగరం మీద దాడిమాని, మిగిలిన సైనికులతో కలిసి, ఉదయగిరి నగరానికి తిరిగి పోవటం మంచిది!'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, పక్కనే వున్న కాళీవర్మకు కనుసైగ చేసి, ''కాళీ, యీ దుర్ముఖరాజు సైనికులకు నిన్ను నాయకుడుగా నియమిస్తున్నాను. యీ దళనాయకుడు, తన కత్తిని నీ పరం చేస్తాడో లేదో అడిగిచూడు!'' అన్నాడు.

కాళీవర్మ, దళనాయకుణ్ణి సమీపించి, ''మా గురువుగారు చెప్పింది విన్నావు కదా? ఏదీ, నీ కత్తిని నా చేతికిస్తావో లేక నేలపై జారవిడుస్తావో, వెంటనే తేల్చి చెప్పు,'' అన్నాడు.

దళనాయకుడు, కాళీవర్మ కేసీ, భల్లూకమాంత్రికుడి కేసీ ఓ మారు చూసి,



కత్తిపట్టిన చేయి వణుకుతూండగా, "కత్తిని తమ స్వాధీనం చేయటం అంటే, నేను దుర్ముఖమహారాజుగారికి ద్రోహం చేసినట్టే గదా? రాజద్రోహం చెయ్యమని, తమ వంటివారు అడగవచ్చునా?'' అన్నాడు.

''ఇది తెలివైన ప్రశ్నేకాని మీ రాజు ఒక ఎలుగుబంటుకు భయపడి, యిక్కడ మీ అందర్నీ మీ కర్మకు వదిలి పారి పోవటం, ఏవిధమైన రాజలక్షణం అవుతుంది?'' అంటూ భల్లూకమాంత్రికుడు, దళనాయకుడి పక్కన వున్న సైనికుణ్ణి చేయి పట్టుకుని వెనక్కు తిప్పి, వాడి వెన్ను మీద మంత్రదండాన్ని ఆనించి, ''ఇదుగో, ఇక్కడ నేను అంజనం



వేస్తున్నాను. దుర్ముఖుడు ఎలాంటి దురవస్థలో వున్నాడో నువ్వూ, నీ తోటి సైనికులూ చూడండి!'' అన్నాడు.

ఆ మరుక్షణం సైనికుడి వెన్ను మీది వస్త్రభాగమంతా నల్లని నీలినీడలు ముసిరినట్టు అయిపోయి, వెంటనే తళతళమంటూ మెరిసింది. అందులో మహారణ్యం చెట్లలో గుర్రాలను వేగంగా దౌడుతీయిస్తూ రాజు దుర్ముఖుడూ, అతడి అంగరక్షకుడూ కనిపించారు. వాళ్ళను వెంబడిస్తూ తలారి భల్లూకం పరిగెత్తుతున్నది. ముందు పోతున్న దుర్ముఖుడి గుర్రాన్ని, ఒక చెట్టుచాటు నుంచి బయిటికి వచ్చిన ఏనుగు ఒకటి తొండంతో కొట్టబోయింది. దుర్ముఖుడు ఒక చావుకేకపెట్టి, దెబ్బ తప్పించుకుని, తన అంగరక్షకుడితో పాటు పక్కకు పారిపోయాడు.

ఇప్పుడు దుర్ముఖుడి వెంటబడివస్తున్న తలారి ఎలుగుబంటు హఠాత్తుగా ఎదురవటంతో ఏనుగు దాన్ని తొండంతో పట్టి పైకెత్తబోయింది. తలారి భీకరంగా ఒక కేకపెట్టి, గండ్రగొడ్డలితో ఏనుగు తొండం మీద గట్టిగా కొట్టాడు. ఆ దెబ్బకు తొండం సగం తెగి వేళ్ళాడుతూండగా ఏనుగు ఘీంకరిస్తూ వెనక్కు తిరగబోయేంతలో, తలారి ఎలుగుబంటు దాని మెడ మీద ఎక్కి కూర్చుని, కుంభస్థలం పైన గండ్రగొడ్డలి పిడితో గట్టిగా పొడుస్తూ, ''ఊఁ, ఆ దుష్టుడు, దుర్ముఖుడెక్కడ? వాణ్ణి తరిమిపట్టుకుని తల నరకాలి!'' అంటూ అరిచింది.

రాజు దుర్ముఖుడు యీలోపల అరణ్యంలో చాలా దూరం వెళ్ళిపోయాడు. అతడికి తలారి భల్లూకంతోపాటు, ఏనుగు కూడా వెంటబడి వస్తున్నదన్న భయం పట్టుకున్నది. అంగరక్షకుడు అతణ్ణి హెచ్చరిస్తూ, ''మహారాజా, మనం దారీ తెన్నూ కానకుండా,' మన రాజ్య సరిహద్దులు కూడా దాటి పోతున్నట్టున్నది,'' అన్నాడు.

రాజు దుర్ముఖుడు కోపంగా, "ఒరే, మందమతీ! ప్రాణాల కన్న రాజ్య సరిహద్దులు విలువైనవా?" అంటూ గుర్రాన్ని చర్నాకోలతో గట్టిగా కొట్టాడు.

భల్లూకమాంత్రికుడు, సైనికుడి వెన్ను మీద యీ సారి మంత్రదండంతో గట్టిగా పొడిచి, వాడు బాధతో ఎగిరి గంతు వేయగానే, "నే వేసిన అంజనం కాస్తా, వీడుపాడు చేశాడు! సరే, మీ రాజు దుర్ముఖుడి పలాయనం చూశారు గదా?" అని దళనాయకుణ్ణీ, సైనికుల్నీ అడిగాడు.

భల్లూకమాంత్రికుడి శక్తి ఎలాంటిదో చూసిన దుర్ముఖుడి సైనికులు ఏకకంఠంగా, "ఏం చేయాలో, మీరే సెలవివ్వండి!" అంటూ కేక పెట్టారు.

"అలా అయితే, నా వెంట చంద్రశిలా నగరానికి రండి. ఆ రాజు జితకేతుడి సంగతేమిటో చూడాలి. ఈ క్షణం నుంచీ మీ నాయకుడు కాళీవర్మ, విన్నారా?" అన్నాడు భల్లూకమాంత్రికుడు.

అందరూ కదిలి చంద్రశిలా నగరం కేసి బయలుదేరారు. అదే సమయంలో అరణ్యంలో పారిపోతున్న రాజు దుర్ముఖుణ్ణీ, అతడి అంగరక్షకుణ్ణీ, చెట్లకొమ్మల్లో దాగివున్న నాగమల్లు అనే దొంగల నాయకుడు చూశాడు. వాడు పక్కనే వున్న యిద్దరు అనుచరులతో, "ఒరే, ముందు గుర్రం మీద వస్తున్నవాడి దుస్తులు చూస్తూంటే, ఎవడో మంచి సంపన్నుడిలా వున్నాడు. వెనక వున్న



వాడు, అతడి నౌకరో, సైనికుడో అయి వుండాలి. ఇద్దర్నీ ప్రాణాలతో పట్టుకుంటే, తరవాత వాళ్ళ బంధువుల్నుంచి కూడా, వీళ్ళ విడుదల కోసం డబ్బు గుంజవచ్చు,'' అన్నాడు.

నాగమల్లు అనుచరులిద్దరిలో ఒకడు, తనచేతిలో చుట్టగావున్న బలమైన తాడును అటూ ఇటూ ఊపుతూ, ''దొరా, వీళ్లను ఎదటపడి ప్రాణాలతో పట్టటం కుదిరేది కాదు; వాళ్ళు కత్తులు దూసి ఎదిరించ గలరు. ముందుగా ఒకణ్ణి, యీ తాడు విసిరి, ఉచ్చులో బంధించటం ఎలా వుంటుంది?'' అన్నాడు.

''ఓఁ, భలే ఉపాయం! అదుగో, వస్తున్నారు! అందుబాటులోకి రాగానే, ముందు గుర్రం మీద వున్న వాడి నడుముకు ఉచ్చు తగిలించి, పైకి లాగు. ఆ రెండోవాడి సంగతి మేం యిద్దరం చూస్తాం,'' అన్నాడు నాగమల్లు.

రాజు దుర్ముఖుడుగాని, అతడి అంగరక్షకుడుగాని, యింత మహారణ్యంలో తమకు భల్లూకమాంత్రికుడి ఎలుగుబంటు నుంచే కాక, మరి యితరత్రా ప్రాణాపద రావచ్చన్న ఆలోచనలోనే లేరు. వాళ్ళు తలారి భల్లూకం నుంచి సాధ్యమైనంత దూరం పారిపోవాలనే ఆదుర్దాలో వున్నారు.

దుర్ముఖుడి గుర్రం చెట్టును సమీపించి, దాని కొమ్మల కిందుగా పరిగెత్తే సమయంలో నాగమల్లు అనుచరుడు చేతిలోని తాడు ఉచ్చును గురిగా, అతడి మీదికి విసిరి, తాడు రాజు నడుమును బిగించగానే కొమ్మల మీదికి గుంజాడు. రౌతు లేని గుర్రం వేగంగా ముందుకు పరిగెత్తి పోయింది.

దుర్ముఖుడు ఏమిజరిగిందీ అర్థంకాక ఒక చావుకేక పెట్టి, తాడు నుంచి వేల్లాడసాగాడు. నాగమల్లూ, అతడి రెండవ అనుచరుడైన దొంగా, భీకరంగా ఒక కేకపెట్టి, కత్తులు ఝుళిపిస్తూ, కొమ్మల్లోంచి అంగరక్షకుడి గుర్రం ముందుకు దూకారు. —(ఇంకావుంది)






# పాపాత్ముడి పుణ్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్లి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఏవైనా పాపాలు చేసి, వాటి పరిహారం కోసం ఇలా శ్రమపడటం నియమంగా పెట్టుకున్నావా ఏం? ఎందుకంటే పాపాలు అలా పరిహారం కావనటానికి నిదర్శనంగా నీకు శరభయ్య కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

శరభయ్య అనేవాడు కోటీశ్వరుడి కొడుకు. తండ్రి అనంతరం అతను డబ్బుతో సాధించదగిన సుఖాలన్నీ తనివి తీరా అనుభవించి, సుఖాల కోసం అనంతంగా పాపాలు సైతం చేశాడు. అతను చెయ్యని అన్యాయమూ, అవలం

## బేతాళ కథలు

బించని అవినీతి లేదు. ఇలా సుఖ లోలుడుగానూ, దైవభీతి లేనివాడుగానూ బతికిన శరభయ్య నడివయసు దాటి వార్ధక్యం మీదపడే వయసులో, తాను గడిపిన జీవితం గురించి అమితంగా పశ్చాత్తాపపడసాగాడు. ఎంతటి అసమర్థు డైనా జీవితంలో అనేక మంచిపనులుచేసి, అంతో ఇంతో పుణ్యం సంపాదిస్తాడు. కాని వెనక్కు తిరిగి చూసుకుంటే శరభయ్యకు తాను ఒక్క మంచిపని చేసినట్టుగాని, చిన్నమెత్తు పుణ్యం సంపాదించినట్టుగాని తోచలేదు.

ఒక్కసారిగా శరభయ్య వైఖరి పూర్తిగా మారిపోయింది. అతను సుఖాలమీద విరక్తి కలిగి, తన మిగతా జీవితమంతా దానధర్మాలలోనూ, పుణ్యకార్యాలలోనూ గడపనిశ్చయించాడు.

శరభయ్య అంటే ఎంతో దురభి ప్రాయంగలవాళ్లు అతనిలో మార్పు చూసి, అతన్ని ఒక దేవుడుగా చూడ సాగారు. అతని దానగుణం దానం పుచ్చుకునే పేదలనే ఆశ్చర్యపరచింది. అయితే అతని కొడుకులూ, భార్యా మటుకు శరభయ్యకు మతి చెడిందను కున్నారు. దానధర్మాలతో త్వరలోనే ఉన్నదంతా ఖర్చుచేస్తాడని భయపడి, వాళ్లు శరభయ్యను తమ భాగాలు పంచి ఇయ్యమన్నారు. శరభయ్య అభ్యంతరం చెప్పలేదు. తన పాపాలు పరిహారం కావా లంటే, తన సొంతడబ్బుతోనే కావాలి.



శరభయ్య వంతు వచ్చిన ఆస్తి అంతా దానధర్మాల కింద త్వరలోనే ఖర్చు అయిపోయింది. చివరకు అతను తన ఇల్లుకూడా అమ్మేసి వీధిలో నిలబడ వలసిన పరిస్థితి వచ్చినాక, తన శేష జీవితం తీర్థయాత్రల కింద గడప నిశ్చయించి, ఇంటినుంచి బయలుదేరాడు.

అతను అరణ్యమార్గంగా పోతూండగా, ఒకచోట ఒక బ్రహ్మరాక్షసి అతని దారికి అడ్డంగా నిలబడి, ''అయ్యా, నువు చూడగా ఉత్తముడిలాగా ఉన్నావు. నాకు ఒక ఉపకారం చెయ్యగలవా ?'' అని అడిగాడు.

శరభయ్య బ్రహ్మరాక్షసిని చూసి భయపడక, ''ఏమిటది?''అని అడిగాడు.

''నేను చెప్పరాని పాపాలు ఎన్నో చేసి, ఇలా బ్రహ్మరాక్షసిగా బతుకుతున్నాను. మీరు నాకు మీ పుణ్యం దానంచేసి నట్టయితే, నాకు విముక్తి కలుగుంది," అన్నాడు బ్రహ్మరాక్షసి.

''తప్పకుండా అలాగే చేస్తాను,'' అంటూ శరభయ్య, తనకుగల పుణ్యం యావత్తూ బ్రహ్మరాక్షసికి ధారపోశాడు.

కాని బ్రహ్మరాక్షసి రూపం ఏమాత్రమూ మారలేదు. బ్రహ్మరాక్షసి నిరాశతో, ''మొదలు నీకు పుణ్యం ఉంటే గద నాకు ధారపోయటానికి?'' అని శరభయ్యను దెప్పాడు.

అయితే అంతలోనే ఆకాశం నుంచి దేవతావిమానం ఒకటి వారి సమీపంలో



దిగింది. బ్రహ్మరాక్షసి పరమానందంతో అందులోకి ఎక్కబోయాడు. కాని దేవ సారథి బ్రహ్మరాక్షసినితోసేసి, విమానంలో శరభయ్యను ఎక్కించుకున్నాడు. బ్రహ్మరాక్షసి చూస్తుండగానే విమానం ఆకాశంలోకి లేచిపోయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, తనకున్నదంతా దానధర్మాలకింద ఖర్చు చేసిన శరభయ్యకు పుణ్యం లేకుండా ఎందుకు పోయింది ? ఆ దానధర్మాలు అతని పాపాలు పరిహారం చెయ్యటానికే సరిపోయినందువల్లనా ? లేక అతను పుణ్యం సాధించుకోవాలన్న స్వార్థంతో చేసిన దానధర్మాలు కావటంచేతనా ? ఏమైనా బ్రహ్మరాక్షసికి విముక్తి కలిగించ లేకపోయిన శరభయ్య బొందితో స్వర్గానికి పోవటం మరింత వింత కాదా ? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శరభయ్య పుణ్యం సంపాదించుకోలేదనుకోవటం పొరపాటు. అతను తన గత జీవితం గురించి పశ్చాత్తాపపడిన క్షణం నుంచీ ఎంతో పుణ్యం సంపాదించాడు. అతనిలో ఏ కోశానా స్వార్థం లేదు. ఉన్నట్లయితే తన పిల్లల ఆస్తిని కూడా తన పుణ్యం కోసం ఖర్చు చేసేవాడే. అంతకన్న మంచి నిదర్శనం ఏమంటే, తనలాగే పాపాలు చేసి తనకన్న దారుణంగా బ్రహ్మరాక్షసి జన్మ ఎత్తిన వాడి విముక్తి కోసం తన పుణ్యమంతా ధారపోయటానికి సిద్ధపడ్డాడు. అయితే బ్రహ్మరాక్షసిలో వల్లమాలిన స్వార్థం ఉన్నది. శరభయ్యతో పోల్చితే వాడు హీనుడు. అందుకే ఇంకొకరి పుణ్యంతో తాను బాగుపడాలనుకున్నాడు. అందుకే వాడి కోరిక తీరక, బ్రహ్మరాక్షసిగానే వుండిపోవలసి వచ్చింది. స్వార్థం ఏ కోశానాలేని శరభయ్య కోసం దేవతలు విమానం పంపారంటే అందులో వింత ఏమీలేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# జరగలేదు

మణిపురం రాజు చంద్రసేనుడికి జ్యోతిషంలో అమితమైన నమ్మకం. ఆయన పొరుగుదేశం మీద యుద్ధం చేయదలచి, జ్యోతిష్కులను పిలిపించి, తన భవిష్యత్తు చెప్పమన్నాడు.

జ్యోతిష్కులు రాజు జాతకం పరిశీలించి, "మహారాజా, ఈ సంవత్సరం గ్రహగతి తమకు శత్రువుల వల్ల అపజయాన్ని సూచిస్తున్నది," అన్నారు.

రాజు ఎవరికీ చెప్పకుండానే తన యుద్ధప్రయత్నం మానుకున్నాడు.

సంవత్సరం గడిచింది. మంత్రి రాజుకు జ్యోతిష్కుల మాట జ్ఞాపకం చేసి, "మహారాజా, మీరు జ్యోతిష్కులను ఎన్నడూ నమ్మకండి. గడచిన ఏడాది తమకు శత్రువుల వల్ల అపజయం ఉన్నదన్నారు. కాని తాము యుద్ధం చెయ్యనూ లేదు, అపజయం కలగనూ లేదు," అన్నాడు.

రాజుకు జ్యోతిషంలో నమ్మకం పోయింది. —పెంటకోట సోమినాయుడు.





# హడావుడి మనిషి

విద్యావతి బద్ధకం మనిషి కాదుగాని, తాను చేయవలసిన ప్రతిపనినీ గోరంతలు కొండంతలు చేసి చూసుకుని భయపడి పోతుంది.

విద్యావతి భర్త రాజుగారి కొలువులో ఉండేవాడు. ఉదయం వెళ్ళిన మనిషి మళ్ళీ రాత్రికే వచ్చేవాడు. ఆయన అలా కొలువుకు వెళ్ళగానే, ఈవిడ నాలుగిళ్ళకూ పెత్తనానికి వెళ్ళేది. ఆవిడ అంటే అందరికీ సరదా కావటంచేత, వెళ్ళిన చోటనల్లా కాసేపు కూర్చోమని బలవంతపెట్టేవారు.

''ఎలా కూర్చునేదమ్మా? ఆయన వచ్చే సరికి వంటచెయ్యాలి గదా!'' అని రాత్రికి చేయాల్సిన వంట గురించి హడావుడి పడిపోయేది.

''వంటకేముంది? ఇద్దరేగా మీరు?'' అని ఒకామె కూరా, ఇంకో ఆమె పచ్చడీ ఇచ్చేవారు. అయినా ఆమె తన భర్త వచ్చేలోగా అన్నం వండగలనో, లేనో అని బెంగపడిపోయి ఉండి, తన భర్త ఇంటికి వచ్చాక, ఆయన సాయంతో ఆ పని పూర్తిచేసేది.

ఎవరైనా తనని పనిసాయానికి పిలిస్తే, ''అయ్యో, ఈవేళ ఆయన బట్టలు ఉతకాలి,'' అనో, ''ఇంకా గిన్నెలు కడుక్కోలేదు,'' అనో వంకలు చెప్పేది. ఆవిడ సంగతి అందరికీ తెలియడంవల్ల ఆమెను పనిసాయం అడగడంమానేశారు.

విద్యావతికి ఇద్దరు ఆడబడుచు లున్నారు. ఇద్దరూ పెళ్ళిళ్ళు అయి, కాపరాలు చేసుకుంటున్నారు విద్యావతి భర్తకు వాళ్ళంటే ఎంతో ఇష్టం. వాళ్ళకు వేరుశనక్కాయలూ, పేలాలూ అంటే ఎంతో ఇష్టం. వాళ్లు ఉంటున్న ప్రాంతాలలో అవి దొరకవు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

విద్యావతి భర్త తన చెల్లెళ్లకోసమని ఒక బిందెడు వేరుశనగకాయలూ, ఒక బిందెడు ధాన్యమూ కొని, "నా చెల్లెళ్లు వస్తున్నారు. వాళ్ళు వచ్చేసరికి నువు ఈ వేరుశనగ కాయలు ఒలిచి, ధాన్యమంతా పేలాలుచేసి ఉంచు. వాళ్లు నీపనితనానికీ, అభిమానానికీ ఎంతో మెచ్చుకుంటారు. ఉత్తప్పుడెలాగున్నా, ఇప్పుడైనా ఈ పనులన్నీ చెయ్యి," అన్నాడు.

ఆ మాటకు సరేనన్నదేగాని, విద్యావతి గుండెల్లో రాయిపడింది. ఆమె మనసంతా ఈ పనితోనే నిండిపోయింది. ఎవరింటికి వెళ్ళినా ఆమె, "మా ఆడబడుచులు వచ్చేస్తున్నారు. బిందెడు వేరుశనగ కాయలు ఒలవాలి! బిందెడు ధాన్యం పేలాలు చేయాలి!" అనసాగింది. ఆవిడ ఎవరికీ సాయపడిన మనిషి కాదుగనక, ఎవరూ ఆవిడకు సాయం చెయ్యడానిక ముందుకు రాలేదు.

ప్రతిరోజూ ఈ పనులు మొదలు పెట్టాలని ఆమె అనుకునేది, కాని తీరా మొదలుపెట్టబోయేసరికి, చేయాల్సినపని తలుచుకుని ఆమెగుండె అవిసిపోయేది. "అమ్మో! ఇంత పని! మొదలుపెడితే ఎప్పటికి తెమలను?" అనుకుని ఆమె పెత్తనాలకు వెళ్ళేది. అయితే స్థిరంగా ఎక్కడా కూర్చోలేకపోయేది. రానున్న



ఆడబడచులనూ, తాను చేయాల్సిన పనుల్నీ తలుచుకుని ఎంతో ఆరాటపడేది.

ఆడబడుచులు రావడానికింకా పది రోజులున్నదనగా విద్యావతి పెత్తనాలకు వెళ్లడం మానేసింది. ఆవిడకు, పాపం, ఎన్ని పనులున్నాయో, ఏమిటో అని అందరూ జాలిపడ్డారు. ఆవిడ లేకపోతే కొంతమందికి కాలక్షేపం కాదు; వాళ్లు ఆవిణ్ణి పిలవడానికి వెళ్ళారు. అయితే విద్యావతి చాలా హడవుడిగా ఉన్నట్టు కనబడుతూ, వాళ్ళను గుమ్మంలోనే పలకరించి పంపేసింది.

ఒకరోజు మధ్యాన్నం గారడీవాడు వచ్చాడు. వీధిలోని ఆడవాళ్ళంతా వాడి

ప్రదర్శన చూశారు గాని. విద్యావతి ఆ చాయలకు రాలేదు; ''మా ఆడబడుచులు వస్తున్నారు. చాలా పనులున్నాయి.'' అన్నదామె.

ఇదేవిధంగా. కాశీనుంచి గాజులవాడు వచ్చినా కంచి నుండి పట్టుచీరలవాడు వచ్చినా, చూడడానికిగాని, బేరాలాడ డానికిగాని విద్యావతి బయటకు రాలేదు; తన ఆడబడుచులు వచ్చేస్తున్నారనీ, తనకు క్షణం తీరికలేదనీ అందరికీ చెప్పేసింది. ఆవిడ ముఖంలోని గాభరా చూసి, ఆవిడ ఆడబడుచులు చాలా గడుగ్గాయిలై ఉంటారని ఆడవాళ్ళందరూ అనుకున్నారు. ఆ విధంగా విద్యావతి ఆడబడుచులను చూడాలన్న కుతూ హలం కలిగి, అందరూ ఆ ఆడబడుచుల రాకకోసం ఎదురు చూడసాగారు.

అఖరికి విద్యావతి ఆడబడుచులు రానేవచ్చారు. వాళ్ళు విద్యావతితో ఎలా మసులుతారో చూడ్డంకోసమని ఆ రోజు మధ్యాన్నమే ఆ వీధిలోని ఆడవాళ్ళంతా విద్యావతి ఇంటికి వెళ్ళి, అక్కడి దృశ్యం చూసి నిర్ఘాంతపోయారు.

విద్యావతి ఆడబడుచులలో ఒకామె వేరు శనగకాయలు ఒలుస్తున్నది. రెండో ఆమె పేలాలు వేయిస్తున్నది. విద్యావతి హడావుడిగా అటూ, ఇటూ తిరుగుతున్నది.

చూడవచ్చినవారిలో ఒకామె బుగ్గలు నొక్కుకుని, ''అయ్యో. ఈమాత్రానికేనా, తల్లీ, ఇన్నిరోజులూ గుమ్మంకదిలి బయటికిరాలేదు?'' అన్నది.

''పని తలుచుకుంటే నాకు కాళ్లూ చేతులూ ఆడవు. అందుకే ఇన్నాళ్ళూ బయటికి రాలేకపోయాను.''. అన్నది విద్యావతి.

''మా వదిన ఉత్త హడావుడిమనిషి లెండి,'' అన్నారు విషయమంతా విన్న ఆడబడుచులిద్దరూ నవ్వుతూ.



# తీరిన బాకీ

ఒకసారి సంతలో శివయ్య మేకను కొనటానికి వెంకటాద్రి వద్ద పదివరహాలు అప్పు తీసుకున్నాడు. అది కాస్తా చచ్చిపోయింది. శివయ్యకు బాకీ తీర్చాలనిపించలేదు. బాకీ కోసం వెంకటాద్రి ఇంటికి వస్తే శివయ్య భార్య ఇంట్లో లేడని చెప్పసాగింది.

ఇంటి కెదురుగా ఉన్న గణపతి అనేవాడు, "ఇంట్లో ఉండే లేడని చెప్పిస్తున్నావని వెంకటాద్రితో చెబుతానుండు," అని బెదిరించాడు. శివయ్య వాడికి ఒక వరహా లంచం పెట్టి నోరు మూయించాడు. కాని గణపతి అంతటితో ఊరుకోక చాలాసార్లు బెదిరించి, వరహాలు పుచ్చుకున్నాడు.

ఒకసారి హఠాత్తుగా వెంకటాద్రి శివయ్యకు ఎదురయాడు. "మీ బాకీ త్వరలో ఇచ్చేస్తాను లెండి," అన్నాడు శివయ్య.

"గణపతి వసూలుచేసి పెట్టాడు లెండి. మీరు ఇయ్యనక్కర్లేదు," అన్నాడు వెంకటాద్రి.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు.






ఒక తెలివిలేని రాజు వద్ద ఇద్దరు మంత్రులుండేవారు. వారిలో రంజనుడు వివేకం గలవాడు. భంజనుడు పరమమూర్ఖుడు. ఈ భంజనుడు తనలాగే మూర్ఖుడు కావటంచేత, రాజు అతని సలహాలనే అధికంగా పాటించేవాడు. అందువల్ల ప్రజలకు అనేక అనర్థాలు సంభవించేవి. వీటినుంచి ఎలా బయట పడాలా అని వాళ్లు ఆలోచించేవాళ్లు.

గవాక్షుడు అనే యువకుడికి ఒక ఆలోచన తట్టింది. వాడు తనకూ, రాజకుమార్తెకూ పెళ్లి అయినట్టు కలవచ్చిందని కనిపించినవారందరికి చెప్పసాగాడు. ఇది రాజుగారిదాకా వెళ్లింది. రాజు గవాక్షుణ్ణి పిలిచి, "నా కూతురిని పెళ్లాడినట్టు నీకు కల వచ్చిందని అందరికి చెబుతున్నావుట, నిజమేనా?" అని అడిగాడు.

"మహారాజా, రెండూ నిజమే! నాకు కల వచ్చినమాట నిజమే, నేను ఆ సంగతి అందరికీ చెప్పినమాటా నిజమే. కలలోనే కానియ్యండి, రాజుగారి అల్లుడు కావటం గొప్పే కదా!" అన్నాడు గవాక్షుడు. రాజు తన మంత్రులను సలహా అడిగాడు.

"మహారాజా, వాడికి రాజకుమార్తెను పెళ్ళాడినట్టు కల రావటం తప్పు కాదు. కాని దాన్నిగురించి వాడు అందరికి చెప్పినందుకు తగిన విధంగా శిక్షించవలసిందే!" అన్నాడు రంజనుడు.

"ఇలాటి సామాన్యుడు రాజుగారికి తెలియకుండా రాజకుమార్తెను పెళ్లి ఆడటం గొప్ప రాజద్రోహం! వీణ్ణి ఉరి తీయవలసిందే!" అన్నాడు భంజనుడు.

వెంటనే గవాక్షుడి విచారణకు బహిరంగ సభ ఏర్పాటయింది. అతని

కలువకొలను సదానంద

నేరం తెలిసి, విచారణ చూడటానికి జనం తండోపతండాలుగా వచ్చారు.

గవాక్షుడు తనకు కల వచ్చినమాట నిజమేనని అందరిముందూ ఒప్పుకున్న మీదట రాజు, ''కలలో రాకుమారిని పెళ్ళాడటానికి నీ కెన్ని గుండెలు?'' అని గద్దించాడు.

''మహా ప్రభువులు మన్నించాలి! ఇందులో నా తప్పేమీ లేదు. రాకుమారి గారి పాదరక్షలు తుడవటానికైనా పనికి రానని నాకు తెలుసు. నేను వద్దో అని ఎంత మొత్తుకుంటున్నా వినిపించుకో కుండా మన పొరుగుదేశపు రాజు భల్లూక వర్మ నాకూ, రాజకుమార్తెకూ పెళ్ళి జరిపించాడు,'' అన్నాడు గవాక్షుడు.

ఈ మాట వినగానే రాజు మండిపడి, ''ఈ భల్లూకవర్మకు అంత కండ కావరమా? వాడి మదం అణచవలసిందే! ఏమంటావు రంజన మంత్రీ?'' అన్నాడు.

''మహారాజా, అది కలే గదా? అకారణంగా పొరుగురాజుతో వివాదం పెట్టుకోవటం రాజ్యానికి క్షేమంకాదు. రాజగౌరవానికి భంగం కలిగించిన ఈ గవాక్షుణ్ణి శిక్షించటం వరకే మన కర్తవ్యం,'' అన్నాడు రంజనుడు.

''నువ్వేమంటావు, భంజన మంత్రీ?'' అన్నాడు రాజు.



''మహారాజా, ఆ భల్లూకంగాణ్ణి క్షమించితే మనం పిరికిపందల మన్న మాటే గద! వాడి తల తీయాలిసిందే!'' అన్నాడు భంజనుడు.

రాజు సేనాని కేసి తిరిగి, ''సేనానీ, వెంటనే సైన్యాన్ని సిద్ధంచేయించి, రాజ పురోహితుడిచేత దండయాత్రకు ముహూర్తం పెట్టించు. అంతా క్షణాల మీద జరిగిపోవాలి,'' అన్నాడు.

గవాక్షుడు కలగజేసుకుని, ''మహా ప్రభూ, నా కల పూర్తిగా వినలేదు మీరు. నా పెళ్లి భల్లూకవర్మ చేయించటం ఎలా జరిగిందనుకున్నారు? అతను మొదట మన రాజ్యంమీదికి దండెత్తి వచ్చి, ఈ

రంజన, భంజన మంత్రుల ఎదుటే మిమ్మల్ని సంహరించాడు. అప్పుడు రంజన మంత్రి తమ మీదగల విశ్వాసంతో, 'దేవుడిలాటి మహారాజేపోతే నేను బతికి ఏం ప్రయోజనం?' అని కత్తితో పొడుచుకుని ఆత్మహత్య చేసుకున్నారు,'' అన్నాడు.

ఈ మాట విని రాజు సంతోషంతో రంజన మంత్రిని కౌగిలించుకుని, ''అప్పుడు భంజన మంత్రి ఏం చేస్తున్నాడు ?'' అని అడిగాడు.

గవాక్షుడు కంట తడిపెట్టుకుంటూ, ''ప్రజలంతా మీ కోసం ఏడుస్తూంటె, భంజనమంత్రిగారు, 'శరణు! శరణు!' అంటూ భల్లూకవర్మ కాళ్లపైన పడ్డారు. వారిని భల్లూకవర్మ తన మంత్రిగా పెట్టుకున్నాడు. భంజన మంత్రిగారు భల్లూకవర్మకు జేజేలు పలికారు,'' అన్నాడు.

రాజు కళ్లు కోపంతో ఎరుపెక్కాయి. ''ఇంత విశ్వాసఘాతకుడా ఈ భంజనుడు? శిరశ్ఛేదమే వీడికి తగిన శిక్ష!'' అన్నాడాయన.

''శివశివా!'' అన్నాడు రంజనుడు.

''నువ్వేమంటావు భంజన మంత్రీ?'' అన్నాడు రాజు అలవాటు చొప్పున.

రాజుగారి మూర్ఖత్వం ఎలాటిదో తెలిసిన భంజనుడు నిలువునా వొణికిపోతూ, ''మహాప్రభూ, కనికరించండి! బతికుంటే బలుసాకు తినవచ్చు. తమరు అనుమతిస్తే, రాజ్యం విడిచి పోతాను,'' అన్నాడు.

ఆ రోజే భంజనుడు దేశం విడిచి పోయాడు. అతను సభ నుంచి వెళ్లిపోగానే రాజు, ''ఈ గవాక్షుడికి ఏదైనా బహుమానం ఇద్దామనుకుంటున్నాను. ఏమంటావు, రంజన మంత్రీ ?'' అని అడిగాడు.

''వచ్చిన అపవాదు రానే వచ్చింది. అమ్మాయిగారిని ఇతనికిచ్చి చెయ్యండి!'' అన్నాడు రంజనుడు, గవాక్షుడి పట్ల కృతజ్ఞతతో.



# సజాతి - విజాతి

ఒక ఊళ్ళో కంసాలి దుకాణమూ, కమ్మరి దుకాణమూ పక్క పక్కనే ఉండేవి. ఒక రోజు కంసాలి బంగారాన్ని చిన్న సుత్తెతో కొట్టుతూండగా, ఒక బంగారు రేణువు వచ్చి కమ్మరి దుకాణంలో పడింది.

బంగారు రేణువు పడినచోట ఇనుపరేణువు కూడా ఉన్నది. అది బంగారు రేణువును, "ఏం, చెల్లీ, నీ దుకాణం వదిలి ఇలా వచ్చావు?" అని అడిగింది.

"ఏం చెప్పమంటావు? నన్ను మూసలోవేసి కాల్చి సుత్తెతో బాదుతున్నారు! ఆ దెబ్బకు తట్టుకోలేక ఇలా ఎగిరివచ్చి పడ్డాను. అంతకన్న నన్నుబాధించేది ఏమంటే, నేను దెబ్బలు తినేది నా జాతివాడి చేతకాదు, మరోజాతి వాడిచేత!" అన్నది బంగారు రేణువు.

"నా మొర ఎవడితో చెప్పుకోను! నన్ను ఉన్న పాళంగానే కణకణ మండే కొలిమిలో కాల్చి, ఇంకా వేడి తగ్గక ముందే సమ్మెటతో చావు దెబ్బలు కొడతారు. ఆ కొట్టేది మరో జాతి వాడైనా సరిపెట్టుకుందును; నా జాతివాడే నన్ను హూనం చేసేస్తాడు!" అన్నది ఇనుప రేణువు.

—సింగంపల్లి అప్పారావు.



# జయాపజయాలు

కీర్తివర్మకు ప్రపంచాన్ని యావత్తూ జయించాలన్న కోరిక కలిగింది. రాజు బుద్ధిమార్చటం తన వల్ల కాదని తెలిసి మంత్రి, "తమ కులగురువైన రాజర్షి సలహా తీసుకోండి," అని హెచ్చరించాడు.

రాజర్షి ఆశ్రమానికి వెళ్ళి కీర్తివర్మ తన కోరికను ఆయనకు విన్నవించాడు.

"రాజా, నువు కోపాన్ని పూర్తిగా వశం చేసుకుంటే తప్పక ప్రపంచాన్ని జయించగలవు. కోపాన్ని పూర్తిగా జయించి వచ్చి నాకు కనబడు, ప్రపంచాన్ని జయించే మార్గం చెబుతాను," అన్నాడు రాజర్షి.

పదిహేను రోజుల అనంతరం కీర్తివర్మ మళ్ళీ రాజర్షిని కలుసుకుని, 'స్వామీ, కోపాన్ని జయించాను. ప్రపంచాన్ని జయించే మార్గం చెప్పండి," అన్నాడు.

"రాజా, నువు కోపాన్ని జయించలేవనే ధైర్యంతో అలా అన్నాను గాని, నిజంగా ప్రపంచాన్ని జయించే మార్గం నాకు తెలీదు," అన్నాడు రాజర్షి.

కీర్తివర్మ మండిపడి, కత్తి దూసి, "నాతో వేళాకోళమా?" అని రంకె పెట్టాడు.

"ఆగు, రాజా! కోపాన్నే జయించలేవు, ప్రపంచాన్ని జయించగలవా?" అన్నాడు రాజర్షి.

—వల్లూరి బాబూరావు.





# దశావతారాలు

పరమాత్మ త్రిమూర్తుల రూపంలో సృష్టి స్థితి లయాలు చేస్తాడు. బ్రహ్మగా ప్రపంచాన్ని సృష్టిస్తాడు; విష్ణువుగా దాన్ని పోషిస్తాడు; శివుడుగా ప్రపంచాన్ని లయంచేసి, నూతన సృష్టికి అవకాశం కలిగిస్తాడు. జగత్పరిణామం కొనసాగగలందులకు విష్ణువు అప్పుడప్పుడూ అవతారాలు ఎత్తుతాడు. ఒకసారి ప్రళయం వచ్చి, ప్రపంచం మునిగిపోయినప్పుడు, విష్ణువు మత్స్యావతారం ఎత్తి మనువునూ, సప్తర్షులనూ, ఇతర ప్రాణులనూ కాపాడటానికి వారెక్కిన పడవను హిమాలయ శిఖరానికి చేర్చాడు. మనువు ప్రాణులను పునస్సృష్టి చేశాడు.



ఒక రాక్షసుడు వేదాలను దొంగిలించి సముద్రంలో దాక్కుంటే, మత్స్యావతారుడు ఆ రాక్షసుణ్ణి చంపి, వేదాలను మనువుకు ఇచ్చాడు.







మందర పర్వతాన్ని కవ్వంగానూ, సర్ప రాజు వాసుకిని తాడుగానూ చేసి, అమృతం కోసం దేవతలూ, దానవులూ సముద్రాన్ని మథించనారంభించితే, మందర పర్వతం నీటిలో మునిగి పోసాగింది. అప్పుడు విష్ణువు కూర్మావతారం ఎత్తి, ఆ పర్వతాన్ని తన వీపుపై తేలి ఉండేటట్టు చేశాడు.



మరొకసారి హిరణ్యాక్షుడు అనే దానవుడు భూమిని చుట్టచుట్టి, సముద్రంలో ముంచేశాడు. అప్పుడు విష్ణువు వరాహావతారమెత్తి, దానవుణ్ణి చంపి, భూదేవిని జలం నుంచి ఉద్ధరించాడు.



హిరణ్యాక్షుడి తమ్ముడు హిరణ్యకశిపుడు విష్ణు ద్వేషి. కాని అతని కొడుకు ప్రహ్లాదుడు గొప్ప విష్ణు భక్తుడు. విష్ణువు అంతటా ఉన్నాడని ప్రహ్లాదుడు అంటే, అది అబద్ధమని చూపటానికి ఒక స్తంభాన్ని హిరణ్యకశిపుడు విరగ తన్నాడు. ఆ స్తంభంలోంచి విష్ణువు నరసింహ రూపంలో అవతరించి హిరణ్యకశిపుణ్ణి చంపాడు.

ప్రహ్లాదుడి మనమడు బలి మూడు లోకాలనూ జయించి, స్వర్గంలో దేవతలకు చోటు లేకుండా చేశాడు. అయితే అతను మహాదాత; ఎవరేది కోరినా ఇచ్చేవాడు. విష్ణువు మరుగుజ్జు బ్రాహ్మణ రూపంలో వెళ్ళి, బలిని మూడడుగుల మేర కోరాడు. బలి ఇచ్చాడు. వామనుడు ఒక అడుగుతో భూమినీ, ఇంకో అడుగుతో ఆకాశాన్నీ ఆక్రమించి, మూడో అడుగుకు చోటు లేక, బలి నెత్తిన కాలుపెట్టి, పాతాళానికి తొక్కేశాడు.





ఒకప్పుడు క్షత్రియులు మదగర్వితులై మునులనూ, ఋషులనూ పీడించ సాగారు. అప్పుడు విష్ణువు పరశు రాము డనే ఋషి కుమారుడుగా పుట్టి, ఇరవై ఒక్కమారు క్షత్రియులను హతమార్చాడు.



తరవాత రాముడు అవతరించి, ప్రజలకు ఆదర్శ పురుషుడుగా జీవించాడు. పితృవాక్యపరిపాలనా, భాతృప్రేమా, ఆదర్శ రాజ్యపాలనా రాముడి ప్రత్యేక గుణాలు. అతను మహావీరుడు కూడా.



తరవాత విష్ణువు కృష్ణావతారమెత్తి, అనృతానికి అపజయమూ, సత్యానికి జయమూ సాధించాడు. అతను అర్జునుడికి చెప్పిన గీతాబోధ అందరికీ మార్గదర్శకమైనది.



విష్ణువు బుద్ధుడుగా అవతరించి, ప్రజలకు ముక్తిమార్గమూ, అహింసా బోధించాడు. జీవితంలో సంప్రాప్తమయే రకరకాల కష్టాలను ఎలా అధిగమించాలో బుద్ధుడు చెప్పాడు.



మానవులలో ఇంకా పైశాచిక ప్రవృత్తి నశించలేదు. విష్ణువు కల్కిగా అవతారమెత్తి, మానవులలోని దుష్టశక్తులను నిర్మూలించి, భూమి మీద ఆదర్శ జీవితం నెలకొల్పుతాడు.



# రాజ్యక్షేమం

**కా**శీరాజ్యాన్ని పాలించిన సూర్యవర్మకు లేక లేక ఒక ఆడపిల్ల కలిగింది. ఆమెకు రూపవతి అని పేరు పెట్టి, ఎంతో గారాబంగా పెంచి, పెద్ద చేశారు. ఆమెకు యుక్తవయసు వచ్చినాక రాజు ఆమె పెళ్ళి గురించి ఆలోచించాడు. రాజు బంధువర్గంలో రూపవతిని పెళ్ళాడదగిన యువకులు ముగ్గురున్నారు. వారి పేర్లు అజయుడూ, విజయుడూ, సుధీరుడూనూ. ఆ ముగ్గురూ రూపవతిని పెళ్ళాడాలన్న కోరికను రాజుకు తెలిపారు.

సూర్యవర్మ ఆ ముగ్గురినీ పిలిపించి, ''మీరు ముగ్గురూ ఒక ఏడాది పాటు దేశాటన చేసి, రాజ్యక్షేమం కోసం ఉపయోగపడే విద్యలు నేర్చుకురండి. మీలో ఎవరి విద్య గొప్పదని నాకు తోస్తే వారికి రూపవతిని ఇచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

ముగ్గురూ ఎవరి దారిన వారు దేశ సంచారం బయలుదేరి, ఏడాది పూర్తి కాగానే తిరిగి వచ్చారు. రాజు ఒక్కొక్కరినీ విడివిడిగా పిలిపించి, ''నువు ఏ విద్య నేర్చుకువచ్చావు?'' అని అడిగాడు.

అజయుడు రాజుతో, ''నేనొక అద్భుతమైన మంత్రం నేర్చుకున్నాను. ఆ మంత్రం జపిస్తే పెద్ద భూకంపం సంభవిస్తుంది. శత్రువులు మన మీదికి దండెత్తి వచ్చినప్పుడు అది మనకు బాగా ఉపయోగపడుతుంది,'' అన్నాడు.

''అవసరం తీరినాక భూకంపాన్ని ఆపటానికి మంత్రాన్ని ఎలా ఉపసంహరించాలి?'' అని రాజు అడిగాడు.

అజయుడు తెల్లమొహం వేసి, తనకు తెలియదన్నాడు.

విజయుడు కూడా తాను ఒక అపూర్వ మంత్రాన్ని నేర్చుకువచ్చానన్నాడు. దాన్ని

"రాంబాబు"

చదివితే అంతులేని వానలు కురిసి, నదులు పొంగి, జలప్రళయం వస్తుందట.

''దాన్ని ఉపసంహరించాలంటే ఏం చేయాలి?'' అని రాజు అడిగితే, తనకు తెలియదన్నాడు విజయుడు.

సుధీరుడు ఏ అపూర్వవిద్యా నేర్చుకో లేదు, కాని ఒక విషయం తెసులుకున్నా నన్నాడు. అదేమిటంటే: సూర్యవర్మ పరిపాలనలో ఎన్నో లోపాలున్నాయి, ప్రజలు వాటిని గురించి చెప్పుకుంటు న్నారు. దేశం బాగుపడటానికి తాను కొన్ని సలహాలిస్తానన్నాడు సుధీరుడు.

సూర్యవర్మ ఈ మాటకు మండిపడి, సుధీరుణ్ణి కారాగృహంలో పెట్టించాడు. తరవాత ఆయన అజయుణ్ణీ, విజయుణ్ణీ పిలిచి, ''మీరు సంపాదించిన విద్యలు అద్భుతమైనవి. మీ ఇద్దరిలో ఒకర్ని రూపవతి ఎంచుకుంటుంది,'' అని, తనతో పాటు మద్యం తాగమని ఆహ్వానించాడు.

తమ ముందుంచిన మద్యాన్ని తాగుతూనే అజయ, విజయులిద్దరూ చచ్చి పడిపోయారు. ఆ మద్యంలో విషం ఉన్నది. ఇదంతా చూస్తున్న మంత్రి, "మహారాజా, ఏమిటీ దారుణం?'' అన్నాడు.

''రాజ్య క్షేమానికి అనుకూలించే విద్యలు నేర్చుకు రమ్మంటే వీళ్ళిద్దరూ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపులకన్న కూడా దారుణంగా ప్రపంచ సంక్షోభం కలిగించ గల విద్యలు నేర్చుకుని వచ్చారు. వీళ్లను నిర్మూలించటం కన్న లోకానికి ఉపకారం లేదు,'' అన్నాడు రాజు.

ఆయన ఖైదు నుంచి సుధీరుణ్ణి పిలిపించి, ''నువు చెప్పినది నిజమే. నా పరిపాలనలో చాలా అవకతవకలు న్నాయి. వాటిని గురించి తెలుసుకుందామనే మిమ్మల్ని ముగ్గుర్నీ దేశాటనకు పంపాను. నువు పరిపాలన బాగు చేసే మార్గాలు చెప్పావంటే రాజ్యాన్ని పాలించటానికి అర్హుడివన్నమాటే. నీకే రూపవతిని ఇచ్చి పెళ్ళి చేస్తాను,'' అన్నాడు.

తరవాత రూపవతికీ, సుధీరుడికీ వైభవంగా పెళ్ళి జరిగింది.



# స్నేహంలో మోసం

రామయ్యా, భీమయ్యా స్నేహితులు. ఇద్దరి సంపాదనా సమానమే అయినా, భీమయ్యకు ఉన్న తృప్తి రామయ్యకు ఉండేది కాదు. ఒకసారి భీమయ్య రామయ్యకు పదిరూపాయలిచ్చి, దాచమన్నాడు.

ఒక ఏడాది గడిచినాక డబ్బు అవసరమై, భీమయ్య రామయ్యను తన డబ్బు తనకియ్యమన్నాడు. భీమయ్య తనకు డబ్బు ఇచ్చినప్పుడు ఎవరూ సాక్ష్యం లేరు గదా అని రామయ్య, "నువు నాకు డబ్బు ఇచ్చినట్టు జ్ఞాపకం లేదు. సాక్షులుంటే పిలు," అన్నాడు.

రామయ్య దుర్బుద్ధి గ్రహించి భీమయ్య గ్రామమునసబు దగ్గిర ఫిర్యాదు చేశాడు. మునసబు పిలిపించి అడిగితే. భీమయ్య తనకు డబ్బు ఇయ్యలేదన్నాడు.

"భీమయ్య నీకు డబ్బు ఇస్తుండగా చూసినవారు ఇరవై మంది ఉన్నారు," అన్నాడు మునసబు.

రామయ్య తబ్బిబ్బయి, "అదేమిటండీ? నేను భీమయ్య వద్ద డబ్బు తీసుకున్నప్పుడు అక్కడ ఎవరూ లేరే!" అన్నాడు, తన మోసం తానే బయట పెట్టుకుంటూ.

—ఎస్. షాఫీ.





# తల్లిమనసు

కాంతాన్నీ, ఆమె భర్తనీ సంక్రాంతికి రమ్మని ఆమె తండ్రి కబురుచేశాడు. కాంతం భర్తకు ఉద్యోగంలో తీరిక దొరకక వెళ్ళలేకపోయాడు. కాంతం ఒక్కతే పెళ్లి అయిన నాలుగేళ్ళకు పుట్టింటికి బయలుదేరింది.

కాంతం భర్త సుందరయ్య పేదవాడు. కాంతం అక్కలందరూ ధనికులను చేసుకున్నారు. పెళ్లి అయాక మొదటి సారిగా పుట్టింటికి పోతున్నది గనక, కాంతం తన తండ్రికి ఒక పంచే, తల్లికి ఒక రవికెగుడ్డా కొన్నది.

ఆమె పుట్టింటికి రాగానే తల్లి ఎదురుగా వచ్చి కౌగలించుకో లేదు, "రా! ఇదేనా రావడం?" అని తన పని తాను చూసుకున్నది. ఆమె అక్కలు తల్లి చుట్టూచేరి, తమ పట్నాల విశేషాలు చెబుతున్నారు. వాళ్లు కాంతాన్ని చూసి, "ఏమే, కాంతం? మీ ఆయన సంపాదన ఏమైనా పెరిగిందా? లేక నిన్ను పస్తులుంచుతున్నాడా?" అనినవ్వారు.

కాంతం మనస్సు చివుక్కుమన్నది. కాని చిరునవ్వు తెచ్చిపెట్టుకుని, వాళ్ళ ప్రశ్నలకు జవాబులు చెప్పి, కాళ్ళు కడుక్కుని కూర్చున్నది. ఇది తన పుట్టిల్లు. ఇక్కడ తాను అభిమానం తెచ్చుకోవటంలో అర్థం లేదని కాంతం అనుకున్నది.

భోజనాల దగ్గిర కాంతం అక్కలు స్వతంత్రంగా లడ్డూలలాంటి పిండి వంటలు అడిగి అదనంగా వేయించుకుని తిన్నారు. కాంతం అంత స్వతంత్రంగా అడగలేకపోయింది. అడగకపోవటమే మేలయింది. ఎందుకంటే ఆమె తల్లి తన పెద్దకూతుళ్ళకు లడ్డూలు మారు వడ్డించేటప్పుడు, "నీకూ్కడా వడ్డిం

ఎమ్. వి. వి. సత్యనారాయణ

చనా?'' అని కాంతాన్ని, మాటవరసగా అడగనైనాలేదు.

ఆ రాత్రి కాంతం అక్కలందరికీ పడుకునేటందుకు మంచాలు అమరాయి, కాని కాంతం కొంగు పరుచుకుని, నేల మీదనే నిద్రపోయింది.

భోగినాడు అందరూ తలంట్లు పోసు కున్నాక కాంతం నురుగు అయిపోయిన కుంకుడు పులుసుతో తానుకూడా తలంటి పోసుకున్నాననిపించుకున్నది.

తరవాత ఆమె తన తండ్రి కోసం తెచ్చిన పంచెను సంచీలోంచి పైకి తీసి, ఇతరులకు కనపడకుండా తండ్రికి ఇచ్చి, ''నాన్నా, నీకోసం తెచ్చాను,'' అని ఇచ్చింది.

కాంతం తండ్రి మాటా పలుకూ లేకుండా దాన్ని తీసుకుని, దండెంమీద విసురుగా వేసి, ''నువ్వింకా భోజనం చెయ్యలేదా? అందరూ భోజనాలకు కూర్చున్నట్లున్నారు. నువు కూడా వెళ్లి భోజనం చెయ్యి,'' అంటూ గబగబా బయటికి వెళ్లిపోయాడు.

కాంతం నిరాశగా దండెం కేసి చూస్తూ నిలబడి ఉండగా, ఆమె తల్లి అటుగా వచ్చింది. ఆమెకోసం తాను తెచ్చిన రవికను ఆమె కిద్దామనుకుంటూండగా, కాంతానికి తల్లి చేతిలో పట్టుచీర కన బడింది. కాంతం తల్లి తన పెట్టెతెరిచి, ఆ పట్టుచీరను అందులో భద్రంగా దాచుకున్నది.



"అమ్మా, నీ కోసం తెచ్చాను!" అంటూ కాంతం ఆమె చేతిలో రవికగుడ్డ పెట్టింది. తల్లి దాన్ని అందుకుని, దాని కేసి చూడకుండా, దండెం మీద పడేటట్టు విసిరింది. తరవాత తన తల్లి, తాను తెచ్చిన రవిక గుడ్డను చాకలిమనిషికి ఇయ్యడమూ, తండ్రికోసం తెచ్చిన పంచెను ఇంకెవరికో ఇయ్యడమూ కాంతం గమనించింది.

ఆ ఇంట్లో తాను పూర్తిగా పరాయి దాన్నయిపోయానన్న భావం కాంతానికి బలంగా కలిగింది.

ఆమె అక్కడ నిలవలేక, పండగ అయిన మర్నాడే తల్లి దండ్రుల దగ్గిరా, అక్కల దగ్గిరా సెలవుపుచ్చుకుని, తన ఊరికి బయలుదేరింది.

తన భర్తను చూడగానే ఆమెకు దుఃఖం కట్టలు తెంచుకున్నది. ఆమె ఏడుస్తూనే తన భర్తతో తనకు పుట్టింట జరిగిన అవమానం గురించి వివరంగా చెప్పింది.

సుందరయ్య మాట మార్చి కాంతాన్ని ఓదార్చుతూ, ఆమె తెచ్చిన మూట విప్పాడు. అందులో కాంతం బట్టల అడుగున ఒక పట్టుచీరా, డబ్బాలో లడ్డూలూ, ఒక చీటీ ఉన్నాయి. ఆ చీటీలో ఇలా ఉన్నది:

"కాంతం, నన్ను క్షమించు, తల్లీ! నాలుగేళ్ళుగా మాకు పంటల మీద ఆదాయం లేదు. నీ అక్కలు తమ భర్తలకు తెలియకుండా మా కుటుంబాన్ని పోషిస్తున్నారు. నిన్ను నీ అక్కలతో సమంగా ఆదరిస్తే మాకు ఉన్న ఆధారం కాస్తా పోవచ్చునని భయపడ్డాం. నువు ఏమీలేని స్థితిలో కూడా నాకూ, మీనాన్నకూ బట్టలు తెచ్చావంటే అది నీ మంచితనం! కాని నీ అక్కల సంతృప్తి కోసం వాటిని ఎవరికో ఇచ్చినట్టు నటించాం. నీ అక్కలు వెళ్ళిపోగానే వాళ్ళు వాటిని మాకు తిరిగి ఇస్తారు. ఎక్కడ ఉన్నా మీ రిద్దరూ క్షేమంగా ఉండటమే, నే కోరేది—మీ అమ్మ."





# దొరికిన దొంగ

రుద్రపూరు రాజైన జయపాలుడి భార్య రూపమతి వద్ద అపురూపమైన గులాబీ రంగు ముత్యాలహారం ఉండేది. ఆమె దాన్ని ఎప్పుడూ ధరించి, నిద్రపోయేటప్పుడు తన తలకింది దిండు కింద దాచుకునేది. అది అంటే ఆమెకు అమితమైన అభిమానం.

జయపాలుడు అదృష్టవంతుడు. అతని భార్య రూపమతి అందగత్తె. వారికొడుకు శక్తిపాలుడు పదేళ్ళవాడు— వాడుకూడా అందగాడే. అతని ప్రజలు రాజంటే అభిమానం గలవారు. రాజ్యం సుభిక్షం.

ఒకనాడు జయపాలుడు సపరివారంగా వేటకు వెళ్ళాడు. ఆరోజు అతని కష్టాలు ఆరంభమయాయి. మధ్యాన్నందాకా వేట చక్కగా సాగింది. కాని మిట్టమధ్యాన్నం అందరూ విశ్రాంతి తీసుకునేసమయంలో అతిదారుణమైన తుపాను వచ్చిపడింది. వేటకని తెచ్చిన ఏనుగులూ, గుర్రాలూ వశం తప్పాయి. రాజు ఎక్కిన రథం ఒక చెట్టుకు తగలటంవల్ల దాని చక్రం ఒకటి చిన్నాభిన్నమయింది. వెంటనే జయపాలుడు ఒక గుర్రం ఎక్కాడు. అది అదుపు తప్పి, చిత్తం వచ్చినట్టు, దారీతెన్నూ లేకుండా పరిగెత్తసాగింది. తక్కువ ఎత్తులో ఉన్న ఒక చెట్టుకొమ్మ రాజు నుదురుకు బలంగా తగిలి రక్తం కారసాగింది. అతను కిందపడిపోయి, కాలినడకన ఒక వాగు వద్దకు వచ్చాడు ధారాపాతంగా కురిసే వానకు వాగు పొంగసాగింది. రాజుకు ఈత వచ్చును గాని, రక్తం చాలా పోవటంవల్ల బలం తరిగిపోయి, అతను ఆ వాగు వెంబడి కొట్టుకుపోతూ, స్పృహకోల్పోయాడు.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి అతని తల కొద్దిగా నొచ్చుతున్నది. అత



నొక రాళ్ళతో కట్టిన ఇంట ఉన్నాడు. ఒక చక్కనిఆడపిల్ల సాధారణ దుస్తులు ధరించి, అతని కాళ్లు ఒత్తుతున్నది.

అతను కళ్లు తెరవటంచూసి ఆమె తృప్తితో నవ్వి, "తిరిగి ప్రపంచంలో పడ్డావన్నమాట! నాలుగు రోజులుగా నిన్ను గురించి చాలా ఆదుర్దాపడ్డాం. మా రేవులో నువు కనిపించినప్పుడు కొన ప్రాణంతో ఉన్నావు. నువు ఇప్పుడున్నది సోన్‌పూర్ అరణ్యానికి రాజైన ఫకీరా రాజభవనంలో. నేను రాజవైద్యుడి కూతురును. నా పేరు మంజరి. నువు పూర్తిగా కోలుకొనటానికి కనీసం ఒక నెల పట్టుతుంది. మా తండ్రి ఇచ్చే మూలికలతో నీ ఆరోగ్యం చక్కబడుతుంది. నీకు కావలసినది చూడటానికి నేను అహర్నిశలు నీ వద్దనే ఉంటాను. ఏకారణం చేతనో నిన్ను చూసిన క్షణంలోనే నా మనసు నీకు వశమయింది. అందుచేత నీ సపర్యలు, నేనే స్వయంగా చూస్తున్నాను. కాని నువు ఎవరో మాకు తెలియ లేదు. నువు ఎవరో నీ పేరేమిటో తెలిసి నట్టయితే నీ దగ్గిరవాళ్ళకు తెలిపిఉండే వాళ్ళం." అన్నది.

మంజరి తండ్రీ, ఫకీరా వచ్చారు.

"నీ వాలకాన్నిబట్టి మంచి వంశానికి చెందినవాడివని గ్రహించాం. నువు ఎవరో చెబితే నిన్ను మీ ఇంటికి చేర్చుతాం," అన్నాడు ఫకీరా.

తన అసలు వివరాలియ్యటం అపాయ కరమని శంకించి జయపాలుడు, "మా తండ్రి విక్రమపూరుకు చెందిన ఒక వర్తకుడు. నేను పనిమీదపోతూ, దారిలో ఉపద్రవానికి గురి అయాను," అన్నాడు.

వాళ్ళు అతని మాటలు నమ్మారు. మంజరి రోజురోజుకూ అతనికి మరింత సన్నిహితురాలవుతున్నది. ఆమె చేసే సేవలకు అతని హృదయం కృతజ్ఞతతో నిండిపోయింది. ఆమె ఋణం ఎలా తీర్చుకోవాలో అతనికి తెలియలేదు. తాను ఇక్కడినుంచి తప్పించుకుపోవాలంటే

తనకు సహాయపడగలది మంజరి ఒకతే. ఆమె అతన్ని గాఢంగా ప్రేమించినట్టు అనేక నిదర్శనాలు కనపడినాయి. అయితే తాను తప్పించుకు పోయినాక మంజరి అపాయానికి గురిఅవుతుంది. మంజరికి అభ్యంతరంలేని పక్షంలో అతను ఆమెను తనవెంట రుద్రపురానికి తీసుకుపోవాలి. తాము వివాహం ఆడటానికి రూపమతి, పరిస్థితులను పాటించి, అభ్యంతరం చెప్పదు.

జయపాలుడు స్వస్తుడయాక మంజరితో, "నాకు వేరే జీవితంఉన్నది. ఇక్కడి మీ జీవితంలో ఇమడటం నాకు సాధ్యం కాదు. నేను వెళ్ళిపోవాలి. అందుకు నీ సహాయం కావాలి. నేను వెళ్లిపోయాక, నింద నీపై మోపుతారు. నీకు ఎలాంటి శిక్షపడుతుందో నాకు తెలియదు," అన్నాడు.

"నన్ను చిత్రవధ చేస్తారు. అయితే ఆ శిక్షను నేను సంతోషంగా అనుభవిస్తాను. నేను నిన్ను ప్రేమించాను. నువు నీ వాళ్లతో సుఖంగా ఉండటమే నాకు కావలిసింది," అన్నది మంజరి.

"నేను పశువును కాను. నువు నన్ను ప్రేమిస్తే, నేనూ నిన్ను ప్రేమిస్తున్నాను. నువుకూడా నావెంట మా దేశానికి రా. నా పెద్దభార్య అనుమతితో, మా ఆచారం ప్రకారం, నేను నిన్ను పెళ్ళాడుతాను. నీకు అభ్యంతరమా, మంజరీ?" అని జయపాలుడు అడిగాడు.





అందుకు మంజరి సంతోషంగా ఒప్పుకున్నది.

ఒక చీకటి రాత్రి ఇద్దరూ బయలు దేరారు. వాళ్ళు శ్రమపడి ప్రయాణంచేసి రుద్రపురం చేరినమీదట జయపాలుడు, "నీతో ఇంతకాలమూ చెప్పనందుకు క్షమించు, మంజరీ, నే నీ రుద్రపురానికి రాజును," అన్నాడు.

"తెలియక నే నేదైనా అపచారం చేసిఉంటే క్షమించండి," అన్నది మంజరి.

రూపమతి అయిష్టంగానే అనుమతించినమీదట జయపాలుడికీ, మంజరికీ వివాహం జరిగింది.

మంజరి నాగరిక పద్ధతులు ఎరిగినది. రాజభవనంలో ఆమె అందరినీ ఆదరంతో చూసింది. రాజుకొడుకు శక్తిపాలుడు ఆమెకు చాలా మాలిమి అయాడు. ఆమె అతన్ని సొంత కొడుకులాగే చూసుకున్నది. తన స్థాయికన్న రాజభవనంలో మంజరి స్థాయి పెరిగిపోవటం చూసి రూపమతి అసూయతో దహించుకుపోసాగింది. ఒకరోజు ఆమె నిద్రలేస్తూనే తనముత్యాల హారం ఎవరో తీశారని ఆందోళన లేవదీసింది. ఆ నేరం ఎలాగైనా మంజరి మీదికి తోయాలని ఆమె ఉద్దేశం.

రాణిగారి హారం పోయిందనగానే కాపలావాళ్లు కంగారుపడ్డారు. కాని మంజరి, "నేను దొంగను పట్టేస్తాను. నేను అడవి నుంచి వచ్చినదాన్ని కదా! మాకు అనేక మంత్రశక్తు లున్నాయి. దొంగను పట్టుకునే ముందు ఇవాళే నా మంత్రశక్తులు ప్రదర్శిస్తాను. అందరూ రాజభవనం చావడిలోకి రావాలి," అన్నది.

ఆరోజు మధ్యాన్నం తన భర్తతో ఆమె పథకం ఒకటి చెప్పింది. అపరాహ్ణం చావడి జనంతో నిండిపోయింది. కళ్ళకు గంతలు కట్టుకుని మంజరి అక్కడికి వచ్చింది. రాజు ముందు పెద్ద బల్లమీద అనేక వస్తువులు చిన్నవీ, పెద్దవీ పాతిక

దాకా ఉంచబడ్డాయి. మంజరి కోరిన ప్రకారం రాజకుటుంబానికి చెందిన వారు ఒక్కొక్కరే వచ్చి ఒక్కొక్క వస్తువును తాకారు. ఒక వస్తువును ఎవరైనా తాకినప్పుడు రాజు, ''మంజరీ, తాకిన వస్తువు ఏది? కోడిగుడ్డా, గొడుగా, లోటా?'' అని అడిగాడు.

''లోటా"అన్నది మంజరి,అది నిజమే.

మరొకసారి, ''మంజరీ, తాకినవస్తువు ఏది? విసనకర్రా, సంచీయా, లోటా, కోడిగుడ్డా, గ్లాసా, సిరాబుడ్డియా, కొవ్వొత్తా, ఈకా....?'' అని అడిగాడు.

''కొవ్వొత్తి!''అన్నది మంజరి,అదీనిజమే.

ఈ విధంగా మంజరి ప్రతిసారీ నిజం చెప్పింది. అందరూ ఆమె శక్తిచూసి ఆశ్చర్యపడ్డారు.

''రేపు సాయంకాలం లోపల పోయిన హారం దొరక్కపోతే దొంగను పట్టేస్తాను. ఇంతకన్న బలమైన శక్తులు నాకున్నాయి,'' అన్నది మంజరి,

ఆ సాయంకాలం రూపమతి మంజరి వద్దకు రహస్యంగా వెళ్ళి ''మన భర్త మీద ప్రమాణంచేసి రహస్యం దాస్తానంటే నీకో మాట చెప్పాలి,'' అన్నది.

"'అలాగే ప్రమాణం చేస్తాను,చెప్పు,'' అన్నది మంజరి.

''నన్ను క్షమించు, సోదరీ. నేనే దొంగను. అసూయకొద్దీ నీ మీద దొంగతనం మోపాలని చూశాను. నా తప్పు తెలిసివచ్చింది. నీలాటి దొడ్డబుద్ధిగల మనిషిమీద అసూయపడటం అవివేకం,'' అన్నది రూపమతి. ఇద్దరూ కౌగిలించుకుని ఆనందబాష్పాలు రాల్చారు.

మంజరి చేసిన ఇంద్రజాలానికి ఆధారం ఏమిటి? ఎవరన్నా ఒక వస్తువు తాకినప్పుడు రాజు వస్తువులను పేర్కొంటూ అసలు వస్తువు పేరు చెప్పే ముందు ఒక నల్లని వస్తువును చెప్పేటట్టు ముందుగా ఏర్పాటు జరిగింది. ఆ ప్రకారం రాజు లోటాకు ముందు గొడుగుపేరూ, కొవ్వొత్తికి ముందు సిరాబుడ్డిపేరూ చెప్పాడు.

తన ముత్యాలహారం దొరికినట్టు రూపమతి ప్రకటించింది.





# బహుమతి

చలమయ్య తన కోసం డబ్బు ఖర్చు పెట్టుకునే వాడేగాని, ఇతరుల కోసం కానీ ఖర్చు చెయ్యాలంటే అతని ప్రాణం విల విల్లాడేది. ముఖ్యంగా ఎవరింటనైనా ఏ శుభకార్యానికైనా పిలుపువస్తే, వాళ్ళు ఎంత దగ్గిరవాళ్ళయినా సరే కట్నాలూ, కానుకలూ ఇవ్వవలసి వస్తుందని తాను వెళ్ళక, తన భార్యనూ, పిల్లలనూ మాత్రం పంపేవాడు.

"చలమయ్య రాలేదేం?" అని ఎవరన్నా అడిగితే అతని భార్య, "బహుమతి కొనుక్కురావడానికి వెళ్ళారు. ఈ పాటికి వస్తూనే ఉంటారు," అనేది.

అక్షర ముగిసినా అతని జాడ ఉండేది కాదు.

అతని భార్య "ఈ మనిషికి ఎప్పుడూ తాత్సారమే!" అని విసుగునటిస్తూ, పిల్లలతోసహా భోజనం చేసి, భర్తకోసం పిండివంటలు మూట గట్టుకుని, ఇంటికి వెళ్ళిపోయేది.

ఇదంతా నాటకం అని అందరికీ తెలుసు. అందుకే అందరూ ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చలమయ్యను వేళాకోళం చేసేవారు.

ఇలా ఉండగా చలమయ్య ఆప్త మిత్రుడి కూతురు పెళ్లి వచ్చింది. ఈసారి చలమయ్య తప్పించుకోలేడు. భార్యనూ, పిల్లలనూ పంపటానికి బంధువులలో పెళ్లికాదు.

"మా స్నేహితుడు రెండు రోజులు ముందే వచ్చి పెళ్లిపనులలో సహాయపడమంటున్నాడు. కనీసం పెళ్లివేళకయినా వెళ్ళకపోతే బాగుండదు. కానీ కానుక ఏదన్నా ఇయ్యవలసి ఉంటుంది. ఎలాగ?" అని చలమయ్య తన భార్యను సలహా అడిగాడు.

మాచిరాజు కామేశ్వరరావు

''మట్టిబుర్ర! ఖాళీపెట్టెకు రంగు కాగితాలు చుట్టి తీసుకుపోయి ఇస్తే సరి పోలా? ఆ పెళ్లి హడావుడిలో ఎవరేం ఇచ్చారో ఎవరికి తెలుస్తుంది? మీరు ఇచ్చారన్నదే అందరికీ తెలుస్తుంది,'' అన్నది చలమయ్య భార్య.

ఈ ఆలోచన చలమయ్యకు నచ్చింది. పెళ్లికి బయలుదేరబోతూ అతను ఒక అట్టపెట్టె నిండా ఏవో చెట్లఆకులు దూసి కుక్కి, వాటిమధ్య ఒక మల్లెపూవు పెట్టి, పెట్టెకు రంగుకాగితాలు చుట్టి, గొప్పగా దాన్ని తీసుకుని తన ఆప్తమిత్రుడి కూతురి పెళ్లికి వెళ్ళాడు.

అయితే చలమయ్య భార్య అను కున్నట్టు జరగలేదు. ఎన్నడూ ఏ పెళ్లికీ వెళ్ళని చలమయ్య మీదా, అతని చేతిలో పెట్టెమీదా అందరి కళ్ళూ ఉన్నాయి. చలమయ్య పెళ్లికానుక ఇయ్యటం గొప్ప వింతకద.

చదివింపులు అయినాక అందరూ భోజ నాలకు కూర్చున్నారు. పెద్ద బరువు దించేసుకున్నవాడల్లే చలమయ్య విస్తరి ముందు కూర్చున్నాడు. ఇప్పుడున్న స్థితిలో లడ్డూలవాసన అతనికి ఎంతో బాగున్నట్టు తోచింది. అతడు ఉత్సాహంగా పక్కన వున్న వాళ్ళతో మాట్లాడసాగాడు.

చలమయ్య పంక్తినే కూర్చున్న మరో స్నేహితుడు నలుగురూ వినేటట్టుగా, ''చలమయ్య ఇంత మంచి బహుమతి ఇస్తాడని మాటమాత్రం తెలిస్తే, నా కూతురి



పెళ్లి ఏనాడో చేసి ఉందును,'' అన్నాడు ఛలోక్తిగా.

లడ్డూ తినబోతున్న చలమయ్యకు చప్పున ఒళ్ళు చల్లబడినట్టయింది. ఈ స్నేహితుడు తాను తెచ్చిన పెట్టె తెరిచి చూశాడన్నమాట? చలమయ్యకు తల కొట్టేసినట్టయింది; ఈ ఆలోచన చెప్పిన తన భార్యమీద పీకలదాకా కోపం వచ్చింది.

''చలమయ్య ఏం బహుమతి ఇచ్చాడేం?'' అని ఒకరిద్దరు కుతూహలంగా అడిగారు.

''తెచ్చి చూపిస్తాను,'' అంటూ ఆ స్నేహితుడు లేచివెళ్ళి, చలమయ్య తెచ్చిన పెట్టెతోసహా తిరిగి వచ్చాడు.

చలమయ్య ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్కలేదు. అందరిముందూ తన పరువు పోబోతున్నది. అందరూ తనను ఛీ అంటారు. ఇలా పదిమందిలో అవమానం పొందేకన్న పెళ్లికి రాకపోయినా బాగుండిపోయేది!

చలమయ్యకు తన చేతిలో ఉన్న లడ్డు ఈసారి చెడ్డ వాసన కొట్టుతున్నట్టు తోచింది.

''చూడండి. చలమయ్య పెళ్లికూతురికి ఎంత ఖరీదైన వజ్రపుటుంగరం బహుమతి చేశాడో!'' అంటూ ఆ స్నేతుడు గారడీ చేసేవాడిలాగా పెట్టెలో నుంచి ఉంగరం ఒకటి పైకి తీసి, దాన్ని ఒక్కొక్కరికే చూపించసాగాడు.

చలమయ్య తన కడుపులో నుంచి తన్నుకు వస్తున్న ఆర్తనాదాన్ని బలవంతాన ఆపుకున్నాడు. అది తన చేతి ఉంగరమే! ఆకులు దూసినప్పుడు వేలి నుంచి వచ్చేసి, ఆకులతో బాటు పెట్టెలోకి చేరి ఉంటుంది! తాను గమనించనే లేదు.

తాను నష్టపోయిన విచారం వెనువెంటనే, తనకు పెళ్ళికి వచ్చిన పది మందిలోనూ పెద్ద అవమానం కొద్దిలో తప్పినందుకు చలమయ్యకు ఎక్కడలేని సంతోషమే కలిగింది.





# దేవీ భాగవతం

ఇలా చెబుతున్న సూతుడికి మునులు అడ్డంవచ్చి, "బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి స్థితి లయ కారకులనీ, ఆ ముగ్గురిలో విష్ణువు ఉత్తముడనీ విన్నాం. అలాటి విష్ణువును యోగనిద్ర అవహించినప్పుడు అతని శక్తీ, తేజస్సూ ఏమయాయి? ఆదిశక్తికి ఇతన్ని మించిన శక్తి ఎలాకలిగింది? విష్ణువే కారణాలన్నిటికీ కారణమని విన్నాం. నువు శక్తి మాత్రమే అన్ని కారణాలకూ కారణమంటున్నావు. నిజం ఏదో మాకు తెలియటం లేదు," అన్నారు.

### శక్తి స్వరూపం

దానికి సూతు డిలా అన్నాడు:

"మునులారా, మీరడిగిన దానికి సమాధానం శ్రద్ధగా వినండి. నారదుడు మొదలైనవారు అంతుచిక్కని శక్తి ప్రభావాన్ని అర్థం చేసుకోలేక, విష్ణువే సర్వశక్తిమంతుడని భ్రమపడ్డారు. అలాగే కొందరు శివుడే పరదైవమనీ, మరికొందరు సూర్యుడనీ, మరికొందరు అగ్ని అనీ, ఇంకా కొందరు చంద్రుడనీ, ఇంద్రుడనీ, కొందరు ఏదో అనీ, మాయలోపడి, రకరకాలుగా అభిప్రాయపడతారు. ఎవరు ఏ ప్రమాణాలు చెప్పినా, అన్ని ప్రమాణాలకూ అతీతమైన పరశక్తి మాత్రమే నిజమైన శక్తి. అది విష్ణువులో, శివుడిలో, సూర్యుడిలో, వాయువులో, అగ్నిలో కనబడుతూంటుంది."

అలా శక్తిచేత మేల్కొల్పబడి విష్ణువు బ్రహ్మను చూసి, "అబ్బాయీ, నువు

## 2. మధు, కైటభుల వధ



తపస్సు కూడా మానేసి ఇలా ఎందుకు వచ్చావు? నీ బాధకు కారణమేమిటి?" అని అడిగాడు.

"ఇంక నేను తపస్సు చేసుకోవటం కూడానా? నీ చెవుల నుంచి ఇద్దరు రాక్షసులు, మధుకైటభు లనే వాళ్లు పుట్టి, నన్ను చంపుతామంటూ యుద్ధానికి పిలిచారు," అన్నాడు బ్రహ్మ.

"దీనికే భయపడతావా? నేను ఎంత లేసి రాక్షసులను చంపానుకాను?" అని విష్ణువు అంటున్నంతలోనే, ఆ రాక్షసులు వచ్చి పడి, బ్రహ్మతో, "పారిపోయి వచ్చి, ఇక్కడ దాక్కున్నావా? మేం కనుక్కోలేమనే? నిన్ను ఇతను రక్షిస్తాడా? చచ్చేవాడివి నువు ఒంటరిగా చావక, ఇతన్ని తోడు చావమంటావా?" అని మీదికి వచ్చారు.

విష్ణువు బ్రహ్మను తన వెనక్కు రమ్మని, రాక్షసులతో, "తెగ వదరుతున్నారు, మదమెక్కిందా? తొందర పడకండి, మీ తీట తీర్చుతాను," అంటూ యుద్ధానికి సిద్ధపడ్డాడు.

దేవి ఆకాశం నుంచి చూస్తూండగా విష్ణువూ, మధుడూ యుద్ధం ప్రారంభించారు. సముద్రం పొంగి పొరల సాగింది. మధుడు అలిసిపోవటం చూసి కైటభుడు విష్ణువుతో మల్లయుద్ధం ఆరంభించాడు. రాక్షసులిద్దరూ కలిసి పోట్లాడుతూంటే విష్ణువుకు క్రమంగా నీరసం వచ్చేసింది. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు. రాక్షసులను ఎలా జయించాలి? తనకు దిక్కేది?

విష్ణువు ఇలా అనుకుంటుంటే రాక్షసులు అతనితో, "యుద్ధం చెయ్యటానికి శక్తి చాలకపోతే, మాకు దాసుణ్ణని దణ్ణం పెట్టు. లేకపోతే నిన్ను చంపి, తరవాత బ్రహ్మను చంపేస్తాం," అన్నారు.

విష్ణువు సౌమ్యంగా వారితో, "అలసిపోయిన వారినీ, వెనక్కు తిరిగినవారినీ, భయపడినవారినీ, యుద్ధంలో పడిపోయిన వారినీ ఎదుర్కోవటం వీరధర్మం కాదు.

అది అలా ఉంచి, మీరు ఇద్దరున్నారు, నేనేమో ఒక్కణ్ణే! ఒక్క క్షణం విశ్రాంతి తీసుకుని యుద్ధం చేస్తాను. కొంచెం ఓర్చుకోండి. మీకు మాత్రం యుద్ధధర్మం తెలియదా?'' అన్నాడు.

''సరే, విశ్రమించు. ఈలోగా మేమూ విశ్రమిస్తాం,'' అన్నారు రాక్షసులు.

అప్పుడు విష్ణువు దివ్యదృష్టితో, ఆ రాక్షసులు వరం పొందిన వారని గ్రహించి, ''అనవసరంగా యుద్ధం చేస్తినే! వీరు స్వేచ్ఛామరణం వరంగా సంపాదించారు. వీరిని ఎలా చంపటం?" అని ఆందోళన పడసాగాడు. చివరకు అతను జగదంబను ధ్యానించాడు:

''తల్లీ, నీ సహాయం లేకుండా నేను ఈ రాక్షసులను చంపలేను. మీదు మిక్కిలి వాళ్ళే నన్ను చంపేస్తారు. నువే వీళ్ళకు వరం ఇచ్చి ఉన్నావు. వీళ్ళు చచ్చే ఉపాయం కూడా నువే చెప్పు.''

దీనంగా వేడుకుంటున్న విష్ణువును చూసి దేవి చిరునవ్వు నవ్వి, "ఈ రాక్షసుల మీద నా మాయ కప్పుతాను. వారిని జయించు,'' అన్నది.

రాక్షసులు విష్ణువుతో, ''ఓడిపోతానని ఎందుకు భయపడతావు? శూరులకు జయాపజయాలు రెండూ సంప్రాప్తమవుతాయి. నీ చేత ఎందరు రాక్షసులు ఓడారు



కారు? ఎప్పుడూ జయమే కలుగుతుందా?'' అని ఎత్తి పొడిచారు.

మధు, కైటభుల యుద్ధం

ఈ మాటకు విష్ణువు మండిపడి, రాక్షసులతో తలపడి, వాళ్ళను పిడికిలితో పొడిచాడు. వాళ్ళు నెత్తురుకక్కుతూ విష్ణువును రొమ్ములో పొడిచారు. ఇలా ముష్టి యుద్ధం సాగింది. విష్ణువు సొమ్మసిలి, రక్తం ఓడుతూ ఉన్న సమయంలో ఆకాశంలో దేవిని చూశాడు.

అదే సమయంలో దేవి రాక్షసుల పైన మన్మధుడి బాణాలలాటి చూపులను ప్రసరించింది. ఆ దెబ్బతో వారు యుద్ధం మాట మరచి మోహపాశానికి చిక్క



పడ్డారు. ఆ స్థితిలో విష్ణువు ఆ రాక్షసులతో, ''ఎంతమంది రాక్షసులనైనా చూశాను గాని, యుద్ధవిద్యలో మీతో సమానులను చూడలేదు. మీ యుద్ధనైపుణ్యం చూసి నాకు చాలా సంతోషమయింది. మీ కోరిక ఏదన్నా ఉంటే చెప్పండి, తీర్చుతాను,'' అన్నాడు.

దేవీప్రభావం చేత మాయామోహితులై ఉన్న రాక్షసులు, విష్ణువు మాటకు అభిమానం తెచ్చుకుని, విష్ణువును తూస్కారంగా చూస్తూ, ''మేం నిన్ను అడిగే వాళ్ళమూ, నువు ఇచ్చేవాడివీనా? కావలిస్తే, నువే కోరు, మేం ఇస్తాం!'' అన్నారు.

''నేను కోరినది ఇస్తారా? నా యుద్ధం చూసి మీకు ఆనందం కలిగిన పక్షంలో నా చేత చచ్చిపొండి,'' అన్నాడు విష్ణువు.

రాక్షసులు కళవళపడి, కొంచెం ఆలోచించి, ''నువు మాటమీద నిలబడేవాడివైతే, మాకు వరం ఇస్తానన్న మాట గుర్తుంచుకుని, నీరులేని విశాలప్రదేశంలో మమ్మల్ని చంపు. అలా అయితేనే నీ చేతిలో మేం చచ్చిపోతాం,'' అన్నారు.

విష్ణువు నవ్వి, తన తొడలు పెంచి, ''రాక్షసులారా, రండి,'' అన్నాడు.

రాక్షసులు విష్ణువు తొడలను మించి తమ శరీరాలు పెంచారు. విష్ణువు తన తొడలనూ, రాక్షసులు తమ శరీరాలను ఇలా పెంచగా, చిట్ట చివరకు రాక్షసుల శరీరాల కన్న విష్ణువు తొడలే పెద్దవి అయాయి. అప్పుడు విష్ణువు తన చక్రాన్ని తలచుకున్నాడు. అది వచ్చి రాక్షసులను నరికేసింది. వాళ్ళ మెదడు, నీటిలోపడి, పెద్ద మిట్ట తయారయింది. అది మొదలు భూమికి "మేదిని" అనే పేరు వచ్చింది.

### వ్యాసుడి తపస్సు

ఇంతవరకు చెప్పిన సూతుడితో మునులు, ''ప్రసంగవశాన ఇతర విషయాలు చాలా విన్నాం. కాని కొడుకు కోసం తపస్సు చేయబోయిన వ్యాసుడి కథ అలాగే ఉండిపోయింది,'' అన్నారు.

మునులతో సూతుడు, వ్యాసుడి తపస్సు గురించి, ఇలా చెప్పాడు :

నారదుడు చెప్పిన మంత్రం జపిస్తూ సువర్ణగిరి మీద, కర్ణికారవనంలో వ్యాసుడు తపస్సు ప్రారంభించాడు. ఆయన శక్తిని మనస్సులో నిలిపి తపస్సు చేస్తూంటే, భూమ్యాకాశాలు కంపించాయి. ఇంద్రుడు భయపడి, దేవతలను వెంట బెట్టుకుని శివుడి వద్దకు వెళ్ళి, "వ్యాసుడు తీవ్రమైన తపస్సు చేస్తున్నాడు. గొప్ప ప్రమాదం వచ్చిపడింది. మమ్మల్ని కాపాడు!" అని ప్రార్థించాడు.

"తపస్సు చేసుకునే వారికి కీడు తలపెట్టరాదు. వాళ్లు ఇతరులకు చెరుపు చెయ్యరు. వ్యాసుడు కొడుకును కోరి, శక్తితో కూడిన నా కోసం తపస్సు చేస్తున్నాడు," అని శివుడు దేవతలతో చెప్పి, వ్యాసుడి ముందు ప్రత్యక్షమై, అతని కోరిక తీరేలాగు వరమిచ్చాడు. వ్యాసుడు తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు.

అతను అరణి మథించి అగ్నిచేసి, "ఇలాటి అగ్నివంటి కొడుకును నాకు ప్రసాదించగల స్త్రీ ఉన్నదా? అయినా, ఆడది పెద్ద ప్రతిబంధకం," అని అనుకుంటూండగా, ఆకాశంలో ఘృతాచి కనబడింది. సమీపంలోనే మన్మథుడు కూడా కనిపించాడు. వ్యాసుడు మన్మథుడి ప్రభా



వానికి గురి అయికూడా, "ఇది నన్ను మోసగించటానికే వచ్చి ఉంటుంది. పోనీ దీనితో సుఖంగా ఉంటే వచ్చేనష్టమేమిటి? దీన్ని చేరదీస్తే మునులు నవ్వుతారేమో? ఇది నా మీద మనసుంచి నాకు సుఖమే కూర్చుతుందా? లేక, పూర్వం ఊర్వశి పురూరవుణ్ణి చేసినట్టు విరహవేదనలో ముంచేస్తుందా?" అనుకున్నాడు.

మునులు సూతుడు చెప్పేదానికి అడ్డు వచ్చి, "ఎవరండీ, ఆ పురూరవుడు?" అని అడిగారు. సూతుడు ఇలా చెప్పాడు :

బుధుడి పుట్టుక

బృహస్పతి భార్య తార అనే ఆమె ఉండేది. ఆమె చాలా చక్కనిది. ఒక



నాడు ఆమె చంద్రుడి ఇంటికి వెళ్ళింది. ఆమెను చూసి చంద్రుడు అమితంగా మోహించాడు. ఆమె కూడా చంద్రుణ్ణి చూస్తూనే అతన్ని ప్రేమించింది. ఇద్దరి మనసులూ ఏకం కావటంతో తార చాలా కాలం చంద్రుడి ఇంటనే ఉండిపోయింది. ఆమె తిరిగి రాకపోయేసరికి బృహస్పతి, ఆమెను పిలుచుకురమ్మని ఒక శిష్యుణ్ణి పంపాడు. తార వాడి మాట లక్ష్యపెట్ట లేదు. బృహస్పతి ఎంతమందిని పంపినా ప్రయోజనం లేకపోయింది. చివరకు ఆయన మండిపడుతూ చంద్రుడి వద్దకు వెళ్ళాడు. ఆయనను చూసి చంద్రుడు నవ్వాడు.

"ఒరే, గురువు భార్య తల్లితో సమానం రా! బ్రాహ్మణుణ్ణి చంపేవాడూ, కల్లుతాగేవాడూ, బంగారం దొంగిలించే వాడూ, గురువు భార్యను కామించేవాడూ, వీరి నలుగురితోనూ స్నేహం చేసేవాడూ, పంచమహాపాతకులు. నీకు స్వర్గప్రాప్తి ఉంటుందా? దేవేంద్రుడు నిన్ను శిక్షించడా?" అన్నాడు బృహస్పతి చంద్రుడితో.

దానికి చంద్రుడు శాంతంగా, "బ్రాహ్మణులకు కోపం తగునా? రేపో మాపో ఈమె బయలుదేరనే బయలు దేరుతుంది. ఇక్కడే కాపరం ఉండి పోతుందా? ఉంటే మాత్రం తప్పేమిటి? ఈ భాగ్యానికి అంతగా విచారించాలా?" అన్నాడు.

బృహస్పతి చంద్రుడికి ఏ సమాధానమూ చెప్పలేక, ఇంటికి తిరిగివెళ్ళి, భార్య కోసం మరికొన్ని రోజులు చూశాడు. భార్య రాలేదు. బృహస్పతికి విచారం పట్టుకున్నది. ఆయన మళ్ళీ చంద్రుడి ఇంటికి వెళ్ళాడు. బయట కాపలావాడు ఆయనను అడ్డగించాడు.

అప్పుడు బృహస్పతి గొంతెత్తి, "ఒరే, దుర్మార్గుడా! ఎంత దారుణానికి ఒడి గట్టావురా! నా పెళ్ళాన్ని నేను చూడ టానికి లేకుండా ద్వారంలో అడ్డం పెడ

తావా ? నా భార్య నీకు సొంతమూ, నాకు దూరమూ కావటమా ? చూడు, శాపం పెట్టి నిన్నేం చేస్తానో ! '' అన్నాడు.

దానికి చంద్రుడు, "నా భార్య, నా భార్య అంటావు! సమస్త లక్షణ సమన్వితురాలైన ఈమె నీ వంటి దరిద్రుడి ఇంట ఉండదగునా ? నీకు భార్య కావాలంటే తగిన దాన్ని కట్టుకుని సుఖంగా ఉండు. అన్ని శాస్త్రాలు చదివావుగాని ఏం లాభం? ఆడది తనకు తగిన వాడితో ఉంటుందనీ, తనకు తగనివాణ్ణి విడిచి పెట్టుతుందనీ తెలుసుకోలేక పోయావు! ఇన్ని మాటలెందుకు? నేను తారను విడిచి పెట్టను. ఇక నువు వెళ్ళు. అసూయతో నువు పెట్టే శాపాలు నాకు తగలవు. నీ యిష్టం వచ్చినది చేసుకో!'' అన్నాడు.

బృహస్పతి చేసేది లేక ఇంద్రుడి వద్దకు వెళ్ళాడు. ఇంద్రుడు ఆయనను గౌరవించి కూర్చోబెట్టి, ''స్వామీ, విచారంగా ఉన్నావేమిటి ? '' అని అడిగాడు.

''నా భార్యను చంద్రుడు అపహరించి, అడిగితే ఇయ్యను పొమ్మన్నాడు. నా భార్యను నాకిప్పించుదూ!'' అన్నాడు బృహస్పతి.

''స్వామీ, నువు విచారించకు. నేను నీ భార్యను విడిపిస్తాను. చంద్రుడు మొండికేస్తే వజ్రాయుధంతో కొట్టి, వాడి మదం అణుస్తాను. దుర్మార్గుడు ఇంత పని చేస్తాడా ? '' అని ఇంద్రుడు దూతకు చెప్పవలసినది చెప్పి చంద్రుడి వద్దకు పంపాడు.

ఇంద్రుడి దూత వెళ్ళి, ఇంద్రుడి తరఫున చంద్రుడికి ఏవేవో నీతులు చెప్పి, తారను విడిచిపెట్టమన్నాడు. చంద్రుడు మండిపడి, ''ఇంద్రుడు ఎంత నీతిపరుడో నాకూ తెలుసు. తార నా మీది ప్రేమను నమ్ముకుని వచ్చింది. ఆమెను ఎలా వదులుతాను? నేను వదలితే మాత్రం ఆమె తన భర్త దగ్గిరికి పోతుందా? నేను ప్రాణాలైనా విడుస్తానుగాని, తారను విడవనని ఇంద్రుడితో చెప్పు.'' అన్నాడు.



# పలుకుబడి

వజ్రగిరి రాజు బావమరిది నీలాంగుడు పెద్ద పొగరుపోతు. అతను ఒకసారి రాజపురోహితుడి కొడుకును క్రూరంగా కొట్టాడు. ఆ కుర్రవాడు నగరకొత్వాలు వద్దకు వెళ్ళి, తన గాయాలు చూపి, నీలాంగుడి మీద ఫిర్యాదుచేశాడు.

ఇదితెలిసి నీలాంగుడు తన అక్క అయిన రాణిని తనకు శిక్షపడకుండా చూడమని బతిమాలాడు. ఆమె కొత్వాలును చూడబోయి, తన తమ్ముడి మీద ఫిర్యాదును కొట్టివేయమన్నది.

"మీరు కోరుతున్నారు గనక అలాగే చేస్తా," అన్నాడు కొత్వాలు. రాణి సంతోషంగా కొత్వాలుకు తన మెడలో హారం తీసి ఇయ్యబోయింది. అంతలో ఎవరో వెనకనుంచి ఆమె చేతిలోని హారాన్ని లాగేసి పారిపోయాడు. పట్టరాని కోపంతో రాణి ఆ దొంగను పట్టి శిక్షించమని కొత్వాలును ఆజ్ఞాపించింది.

"మహారాణీ, ఆ దొంగ చాలాపలుకుబడిగల వాడు," అన్నాడు కొత్వాలు.

రాణికి ఆ మాటతో బుద్ధి వచ్చి, తన తమ్ముణ్ణి విచారించి సరి అయిన శిక్ష విధించమని కొత్వాలుతో అన్నది. వెంటనే కొత్వాలు కొడుకు వచ్చి రాణి హారం ఇచ్చేశాడు.

—మారుపాక మంజురాణి.





# లోభి-పగటివేషగాడు

ఆ ఊళ్లో గురువయ్య పెద్ద ధనవంతుడు, కాని పరమ లోభి.

ఒకసారి ఆ ఊరికి పగటివేషగాడు వచ్చి, సన్యాసి వేషం వేసుకుని, "భవతీ, భిక్షాందేహి", అంటూ గురువయ్య ఇంటి ముందుకు వచ్చాడు.

ఆ మాటలు గురువయ్యకు కర్ణకఠోరంగా వినిపించాయి. అతను బయటికి వచ్చి, సన్యాసిని ఎగాదిగా చూసి, ''నీకేమయింది? కుంటివాడివా? గుడ్డివాడివా?'' అంటూ తలుపు మూసుకున్నాడు.

మర్నాడు వేషగాడు గుడ్డివాని వేషం వేసుకుని, ''అమ్మా, గుడ్డివాడికి దానం చెయ్యండి,'' అంటూ గురువయ్య ఇంటి ముందుకు వచ్చాడు.

వాణ్ణి చూసి గురువయ్య మండిపడి, "ఏంరా, బిచ్చమెత్తటానికి, నువ్వేమయ్యినా కుంటివాడివా, మూగవాడివా? పోరా పో!'' అన్నాడు.

మూడోనాడు వేషగాడు మూగవాడుగా నటించి, గంట వాయించుతూ వచ్చాడు. గురువయ్య వాణ్ణి చూసి, ''నీ కేమయిందిరా?'' అన్నాడు.

వేషగాడు నోరు తెరిచి, మూగవాడినన్నట్టు అభినయించాడు.

''మూగవాడివా? అయితే ఏం? కాళ్లూ, చేతులూ సరిగానే ఉన్నాయే! పని చేసుకోరాదూ?'' అంటూ తలుపు వేసుకున్నాడు గురువయ్య.

మర్నాడు ఉదయం గురువయ్య భార్యకు వంట ఇంట్లో పాము కనిపించింది. ఆమె పరిగెత్తుకుంటూ, అరుగు మీద కూర్చున్న తన భర్త వద్దకు వెళ్ళి, ''అమ్మయ్యో, పాము! నాగుపాము!'' అని అరిచింది.

వి. యజ్ఞరామయ్య

గురువయ్య చప్పున లోపలికి వెళ్లి, కుండల నడుమ తిరుగుతున్న పామును చూసి, ''పాము! పాము!'' అని కేకలు పెట్టుతూ బయటికి వెళ్లాడు.

ఇరుగు పొరుగు వాళ్ళు చేరి, ''పాము ఎక్కడ? ఏ జాతిపాము? ఏ రంగు? పెద్దదా, చిన్నదా?'' అని చొప్పదంటు ప్రశ్నలు వేశారేగాని, సాహసించి ఎవరూ ఇంట్లోకి వెళ్ళలేదు.

ఇంతలో అటుగా ఒక పాములవాడు వచ్చాడు. గురువయ్యకు ప్రాణం లేచి వచ్చింది. అతను ముఖం మీద చెమట తుడుచుకుంటూ, ''అబ్బ, వంటింట్లో నాగుపాము చేరింది. దాన్ని పట్టుకుని మమ్మల్ని కాపాడు,'' అన్నాడు.

''నాగుపామా? కనబడుతున్నదా!'' అని పాములవాడు అడిగాడు.

''లేదు బాబూ, కనిపించటం లేదు. అది ఎక్కడో దూరింది,'' అన్నాడు గురువయ్య.

''అయితే కష్టమే! నాగుపాము పగ పన్నెండేళ్ళంటారు. ఒక్క దెబ్బకు చంప లేకపోతే చాలా ప్రమాదం!'' అన్నాడు పాములవాడు.

''నువే అలా అంటే, మా బోటి వాళ్ళ గతి ఏం కాను? నీ శ్రమ ఉంచు కోనులే!'' అన్నాడు గురువయ్య దీనంగా.

నూరు రూపాయలకు బేరం అది, పాములవాడు వంటింట్లోకి వెళ్లి, ఇల్లంతా వెతికాడు. పాము కనపడలేదు. పాముల



వాడు నాగస్వరం ఊదేసరికి, గోడ కన్నంలో నుంచి పాము వచ్చి, ఆడటం ప్రారంభించింది. పాములవాడు తటాలున దాని మెడ పట్టుకుని, దాన్ని బుట్టలోకి పంపించి, బుట్ట మూత నొక్కాడు.

గురువయ్యకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. కాని నూరురూపాయలు పాముల వాడికిచ్చేటప్పుడు మళ్ళీ ప్రాణం పోయినంత పనీ అయింది. పాములవాడు డబ్బు తీసుకుని, గురువయ్యను పొగ డుతూ వెళ్ళిపోయాడు.

తీరా విచారిస్తే ఆ పాములవాడు పగటి వేషగాడేననీ, తన పెంపుడు పామును వాడే గురువయ్య ఇంట్లోకి పంపకం చేశా డనీ బయట పడింది. గురువయ్యకు అమితమైన ఆగ్రహం వచ్చింది. అతను గ్రామాధికారి వద్దకు వెళ్ళి, పగటివేషగాడు తనను మోసగించాడనీ, తన డబ్బు తనకు తిరిగి ఇప్పించమనీ అన్నాడు.

గ్రామాధికారి పగటివేషగాణ్ణి పిలి పించి అడిగాడు. వాడు జరిగినదంతా చెప్పి, "గురువయ్యగారి లాంటి సంప న్నులే మాలాటి కళాకారులను ఆదుకోక పోతే మా గతి ఏం కాను? మీరే చెప్పండి?" అన్నాడు.

"నువు నీ కళను ప్రదర్శించి బహు మానం పొందితే అక్షేపణ ఉండదు. కాని నువు గురువయ్యగారిని మోసగిం చావు. ఆయన సొమ్ము ఆయనకు తిరిగి ఇచ్చెయ్యి." అన్నాడు గ్రామాధికారి.

పగటి వేషగాడు గురువయ్యకు నూరు రూపాయలు తిరిగి ఇచ్చేశాడు.

గ్రామాధికారి గురువయ్యతో, "కాయ లున్న చెట్టునే రాళ్ళతో కొడతారు. ఉన్న వాడినే లేనివాడు పీడిస్తాడు. పొట్టచేత పట్టుకుని వాడు వచ్చాడు. మీలాటివాళ్ళు వాడికి దానం చెయ్యటం ధర్మం. వాడి కొక పాతికరూపాయ లియ్యండి," అన్నాడు.

గురువయ్య పగటివేషగాడికి పాతిక రూపాలియ్యటమే గాక, వాడు నేర్పిన గుణపాఠంతో తన లోభత్వాన్ని మాను కున్నాడు.



# సమానం

కామయ్యా, సోమయ్యా ఇరుగుపొరుగు వారు. అయితే కామయ్య లక్షాధికారి, సోమయ్య నిరుపేద. కామయ్యకు డబ్బున్నా పిల్లలు లేరు. సోమయ్య పేదరికానికి నలుగురు కొడుకులు.

కామయ్యకు సంతానం కలుగుతుందన్న ఆశకు అవకాశం లేకుండా పోయిన తరవాత, ఎవరైనా పిల్లవాణ్ణి పెంపకం చేసుకోవాలనీ, సోమయ్యకు గల నలుగురు కొడుకులలో ఒకణ్ణి దత్తు చేసుకుందామనీ అనిపించింది.

ఈ సంగతి సోమయ్యకు ఒకనాడు కామయ్య సూచించాడు. తన సూచనను సోమయ్య సంతోషంగా ఆమోదిస్తాడని కామయ్య అనుకున్నాడు. కాని సోమయ్య తన పిల్లల్లో ఒకణ్ణి కామయ్యకు దత్తు ఇయ్యటానికి ఒప్పుకోలేదు.

"ఏమీ? నీ కొడుకు లక్షాధికారి అయి భోగభాగ్యాలతో తులతూగటం నీ కిష్టం లేదా?" అని కామయ్య అడిగాడు.

"ఇష్టం లేదు. నా కొడుకు లందరూ నా రక్తం పంచుకు పుట్టినవాళ్ళే. అందులో ఒకడు లక్షాధికారి అయి, మిగిలిన ముగ్గురూ పేదగా ఉండిపోవటం నా కిష్టంలేదు. నా శక్తి మేరకు వాళ్ళను సమంగా పెంచి పోషిస్తాను. తరవాత దైవకృప!" అన్నాడు సోమయ్య.

—ఇంద్రగంటి నరసింహమూర్తి.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan





Bishan Maheshwari

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ నవంబర్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఈనాటి చదువు

రెండవ ఫోటో : నా తల కెక్కడంలేదు !

పంపినవారు : మొలుగు రామదాసు. వి.ఆర్. రూమ్. విజయవాడ (ఆర్.ఎస్.)

**బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.**

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# అమృతాంజన్
## లిమిటెడ్‌వారి
## విశిష్ఠమైన
# ఆముదము

శుద్ధిచేసినది.
వాసనలేనిది.




మూడు
సైజులలో
లభిస్తాయి:
50 మిలి
100 మిలి
200 మిలి

అమృతాంజన్ ఆముదము